నోరూరించే... మనసుదోచే... మైమరపించే.



పైసలు 25 మాత్రమే!

PARLE POPPINS FRUIT SWEETS 25 Paise

క్రొత్త పార్లే

# పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122b/PP Tel




ఈ సంచికలో ప్రచురింపదలచిన 'పాపంపసివాడు' చిత్రకథ చందమామ అక్టోబరు సంచికలో ప్రచురింపబడును.




Incremin
Syrup

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["ప్రజాభిమాని"]కి ఆధారం టి. ఎస్. మోహన్‌బాబు పంపిన కథ. ఇందులో గొప్ప నీతి ఉన్నది. ప్రజల నిజమైన అవసరాలు తీర్చకుండా, తన ఖ్యాతి కోసం ప్రజలకు లేని సౌకర్యాలు కల్పించే పాలకుడు ప్రజారంజకుడు కాలేడు.

"కలికాలం" అన్న కథలో ఒక అబద్ధాన్ని బయట పెట్టటానికి మరొక అబద్ధం ఉపయోగపడింది. "తమ్ముడి అదృష్టం"లో అబద్ధం నిజమైనప్పుడు అబద్ధం ఆడినవాడు నష్టపోతాడు.

సంపుటి 51 సెప్టెంబర్'72 సంచిక 3



# అమరవాణి

శరది న వర్షతి గర్జతి,
వర్షతి వర్షాసు నిస్స్వనో మేఘః;
నీచో వదతి న కురుతే,
సుజనో వ వదతి కరో త్యేవ. 1

[శరత్కాల మేఘం గర్జిస్తుందిగాని వర్షించదు. వర్షాకాల మేఘం చప్పుడు చేయకుండానే వర్షిస్తుంది. నీచుడు మాటలు చెబుతాడుగాని పనిచేయడు. మంచివాడు మాటలేకుండానే పనిచేస్తాడు.]

అజా యుద్ధే, ఋషిశ్రాద్ధే, ప్రాభాతే మేఘడంబరే,
దంపత్యోః కలహే చైవ బహ్వారంభో లఘుక్రియా. 2

[మేకల యుద్ధంలోనూ, ఋషుల శ్రాద్ధంలోనూ, ఉదయంపూట మేఘాలలోనూ, దంపతుల కలహంలోనూ ఆర్భాటం జాస్తి, క్రియ తక్కువ.]

నశ్య త్యనాయకం కార్యం,
తథైవ శిశునాయకం,
స్త్రీనాయకం, తథోన్మత్త
నాయకం బహునాయకం. 3

[యజమాని లేకుండా జరిగే పనులూ, చిన్న పిల్లలూ, స్త్రీలూ, ఉన్మత్తులూ, అనేకులూ నాయకత్వం వహించి చేసే పనులూ చెడిపోతాయి.]

క్రియా, అక్రియా, దుష్క్రియా



# యథారాజా తథాప్రజా

విజయపురాన్ని పాలించిన ఒక రాజు ప్రజా కంటకుడు. ప్రజలను రకరకాల పన్నులతో పీడించాడు. కళాకారులను దగ్గిరికి రానిచ్చే వాడు కాడు.

అయన ఒకనాడు దర్బారులో తన వద్ద కొలువు చేసే వారిని ఒక ప్రశ్న వేశాడు: "నా పరిపాలన బాగున్నదా? నా తండ్రి పరిపాలన బాగున్నదా? నా తాత పరిపాలన బాగున్నదా?"

ఈ ప్రశ్నకు సభికులు ఎలాటి సమాధానం చెప్పినా రాజు సంజాయిషీ అడిగి ప్రాణాలు తోడేస్తాడు. ఏ ఒకరి పరిపాలన బాగున్నదన్నా, మిగిలిన ఇద్దరి పరిపాలనలో లోటు ఏమిటని నిలవదీస్తాడు. ఆ సంగతి తెలిసిన సభికులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకోసాగారు.

అప్పుడు మంత్రి వారి దుస్థితి గమనించి, లేచి నిలబడి, "మహారాజా, తమ వద్ద కొలువు చేసేవారిలో చాలామంది తమ పరిపాలన తప్ప మరేదీ ఎరగరు. తమ తాత గారి పరిపాలన ఎగిరిన వారు ఒక్కరు కూడా లేరు. అందుచేత తమ ప్రశ్నకు సమాధానం చెప్పటం ఇక్కడ ఎవరికీ సాధ్యం కాదు," అన్నాడు.

ఈ మాట సమంజసమైనదే కావటం చేత రాజు మంత్రితో, "అలా అయితే, మా మూడు తరాల పరిపాలనలూ ఎరిగిన మనిషిని పట్టి తెప్పించండి," అన్నాడు.

రాజభటులు నగరం మీద పడి, కనిపించిన వృద్ధుల నందరినీ, "మీరు రాజు గారి తాతగారి పరిపాలన ఎరుగుదురా?" అని అడగ నారంభించారు. దర్బారులో జరిగిన సంగతి నగరంలో పొక్కటం చేత ముసలివాళ్ళు తమకు ఏమీ తెలియదని తప్పించుకున్నారు. ఎవరో ఒకరిని పట్టుకు పోకపోతే చావు తప్పదని భటుల భయం.

డా. కె. వీరభద్రరావు



వాళ్ళు నగరమంతా చెడ తిరిగి ఒక తమలపాకుల దుకాణం ముందు కూలబడ్డారు. తమలపాకులమ్మేవాడు మాటకారి.

ఆ దుకాణదారు కూడా వయసు మళ్ళిన వాడే కావటం చేత భటులు అతణ్ణి, "తాతా, నువు రాజుగారి తాతను ఎరుగుదువా?" అని అడిగారు.

"నేను రాజుగారి తాతను ఎరగకపోవటమేమిటి? నాకూ ఆయనకూ ఒకే రోజు, ఒకే గురువు దగ్గిర అక్షరాభ్యాసం అయింది," అన్నాడు తమలపాకులవాడు.

"అంటే రాజుగారి తండ్రిని కూడా ఎరిగే వుంటావు. నువు వెంటనే మా వెంట రా!" అన్నారు భటులు.

"దేనికి?" అన్నాడు తమలపాకులవాడు, కాస్త భయపడిపోతూ.

భటులు దర్బారులో రాజు ప్రశ్న వెయ్యటం మొదలుకుని ఆ క్షణం దాకా జరిగినదంతా చెప్పారు. భారమంతా భగవంతుడి పైన వేసి అతను భటుల వెంట రాజసభకు వెళ్ళాడు.

రాజు సభికులకు వేసిన ప్రశ్నే తమలపాకుల వాణ్ణి కూడా అడిగాడు.

తమలపాకుల వాడు, "మహారాజా, నాకు తమలపాకులు అమ్ముకోవటం తెలుసు గాని, రాజ్యపాలన గురించి ఏం తెలుస్తుంది? అయితే తమ తాతగారి హయాం నుంచి తమ హయాం దాకా నాలో కలిగిన మార్పులు చెబుతాను. దాన్నిబట్టి మీరే నిర్ణయించుకోండి," అన్నాడు.

"ఏమిటి ఆ మార్పులు?" అని రాజు అడిగాడు.

తమలపాకులవాడు ఇలా చెప్పసాగాడు:

"మహారాజా, తమ తాతగారు పరిపాలించే కాలంలో నా ఇంటి పొరుగున ఒక ముసలివాడూ, వాడి మనమరాలూ ఉండేవాళ్ళు. ఒకనాడు ఆ ముసలివాడు నన్ను పిలిచి, 'బాబూ, నన్ను మృత్యుదేవత పిలుస్తున్నది. నా మనమరాలి పెళ్ళి చేసి వెళ్ళిపోదామనుకున్నాను గాని, నాకు వ్యవధి లేదు. పిల్ల కోసం రెండువేల దీనారాలు దాచి ఉంచాను.

దానికి మంచి సంబంధం చూసి పెళ్ళి చేసి ఈ డబ్బు దానికి ఇయ్యి.' అని నా చేతిలో డబ్బు పెట్టి కన్ను మూశాడు.

"అతని మనమరాలికి ఎన్నో చోట్ల తిరిగి, మంచి సంబంధం కుదిర్చి పెళ్ళి చేసి, నా వద్ద దాచి ఉంచిన రెండువేల దీనారాలూ ఆమె కిచ్చి కాపరానికి పంపేశాను.

"చాలా కాలం జరిగింది. మీ తాతగారు గతించి మీ తండ్రిగారు రాజ్యపాలన ప్రారంభించారు. ఆ కాలంలో ముసలివాడి మనమరాలు నా కొట్టు ముందుగా పోతూ కనబడింది. ఆమెను చూడగానే నాలో నేను, 'ఎంత బుద్ధిమాలిన పని చేశాను! నా దగ్గిర రెండువేల దీనారాలున్నట్టు ఆమెకు తెలియదు గదా! ఆ డబ్బు నేనే ఎందుకు ఉంచేసుకున్నాను కాను?' అనుకున్నాను. నేను చేసిన పొరపాటుకు బాధపడ్డాను.

"మళ్ళీ ఈ మధ్య నా కామె కనిపించింది. ఈసారి నా బుద్ధితక్కువ నాకు మరింత కొట్ట వచ్చినట్టు స్పష్టమయింది. నేను నిజంగా బుద్ధిలేని వాణ్ణి కాకపోతే ఆ పిల్లను నేనే పెళ్ళాడి, పిల్లనూ, డబ్బునూ సొంతం చేసుకుని ఉండేవాణ్ణి గదా, మహారాజా?" అంటూ తమలపాకులవాడు ముగించాడు.

ఈ కథ విని ఎంతో ముచ్చటపడి రాజు వాడికి వంద దీనారాలు బహుమతి ఇచ్చి పంపేశాడు. తన తాత పరిపాలనలో కన్న తన తండ్రి పరిపాలనలో వాడి బుద్ధి వికసించిందనీ, తన పరిపాలనలో పూర్తిగా వికసించిందనీ రాజు అనుకున్నాడు.

కాని సభికులు రాజు అజ్ఞానానికి చాటుగా నవ్వుకున్నారు. ఈ రాజు తాత ధర్మాత్ముడు. ఆయన పరిపాలనలో ప్రజలకు అధర్మమైన ఆలోచనలు వచ్చేవి కావు. ఈ రాజు తండ్రి దుర్మార్గుడు కాదు గాని ధనకాంక్ష హెచ్చుగా ఉండేది. ఈ రాజుకు ధనకాంక్ష పెరగటంతోబాటు ధర్మచింత అనేది ఏమీ లేకుండా పోయింది. ముగ్గురిలోనూ ఉన్న తేడాలను స్పష్టం చేసే విధంగా తమలపాకులవాడు తన కథ చెప్పాడు.






# మోసకారి

ఒక నగరంలో రంగడు అనే పేదవాడు ఉండేవాడు. వాడు ప్రతిదినమూ అడవికి పోయి, కట్టెలు కొట్టుకుని, వాటిని నగరంలో అమ్ముకుని జీవించేవాడు.

ఒక రోజు ఉదయం రంగడు అడవిలో పోతూ ఉండగా ఒక పొదలో కంకణం ఒకటి వాడికి కనబడింది. దానిని చూసి రంగడు, "వనదేవత అనుగ్రహించింది! దీన్ని అమ్ముకుని కొంతకాలం హాయిగా జీవించవచ్చు," అనుకుని, ఆ కంకణంతో నగరానికి తిరిగి వచ్చాడు.

వాడు ఒక నగల వర్తకుడి వద్దకు వెళ్ళి, "బాబుగారూ, ఈ కంకణం నాకు అడవిలో ఈ ఉదయమే దొరికింది. దీనిని మీరు తీసుకుని దీని ఖరీదు నాకు ఇప్పించండి," అన్నాడు.

నగల వర్తకుడు ఆ కంకణాన్ని శ్రద్ధగా పరిశీలించి, "ఇంత విలువైన కంకణం వీడికి అడవిలో దొరకటం ఏమిటి? దీనిని వాడు ఎక్కడో ఎత్తుకు వచ్చి ఉంటాడు. దీనిని ఎలాగైనా కాజేయాలి," అనుకుని, రంగడితో, "దీని ధరకు సరి అయిన పైకం ఇప్పుడు నావద్ద లేదు. రేపు దీనిని తీసుకురా, డబ్బు ఇచ్చి కొంటాను," అని నమ్మకంగా చెప్పి, కంకణం వాడికే తిరిగి ఇచ్చాడు.

రంగడు ఆ కంకణాన్ని తన ఇంట భద్రంగా దాచి, తాను అడవికి వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళిపోగానే నగల వర్తకుడు రాజుగారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేస్తూ, "మహారాజా, రంగడు అనే కట్టెలుకొట్టే వాడు నా వద్ద ఉండే కంకణాన్ని దొంగిలించాడు. అది వాడి వద్దనే ఉన్నట్టు తెలిసింది. వాడి ఇల్లు సోదాచేసి, నా కంకణం నాకు తిరిగి ఇప్పించండి," అన్నాడు.

ఐ. వెంకటేశ్వరరావు

రాజు వెంటనే భటులను పిలిచి, "కట్టెలుకొట్టే రంగణ్ణి పట్టుకురండి," అని ఆజ్ఞాపించాడు.

భటులు తిరిగివచ్చి, రంగడు అడవికి వెళ్ళినట్టు చెప్పారు.

అది విని రాజు నగల వర్తకుడితో, "నువు రేపు ఉదయం సభకు రా. ఆ కట్టెలుకొట్టేవాడి దొంగతనం రుజువుచేసి, పోయిన నీ కంకణం నీకు ఇప్పిస్తాను," అన్నాడు.

తన ఎత్తు పారినందుకు నగల వర్తకుడు సంతోషించి, కంకణం తనకు దక్కినట్టే సంబరపడిపోయాడు.

మర్నాడు నగల వర్తకుడు రాజసభకు వచ్చాడు. రాజుగారు భటుల్ని పంపి, రంగణ్ణి కంకణంతో సహా పిలిపించాడు. ఆయన రంగడితో, "ఏం రా, ఆ కంకణాన్ని నువు నగల వర్తకుడి వద్ద దొంగిలించావా?" అని అడిగాడు.

అందుకు రంగడు, "మహాప్రభూ, ఈ కంకణం నేను ఎవరివద్దా దొంగిలించలేదు. ఇది నాకు అడవిలో దొరికింది. దీనిని అమ్ముకుని కొంతకాలం సుఖపడదామనుకుని, ఈ నగల వర్తకుడికి అమ్మజూపాను. తగినంత పైకంలేదనీ, ఈ రోజు రమ్మనీ ఈయన అన్నాడు. ఇంతకన్న నాకేమీ తెలియదు," అన్నాడు.



"అంతా పచ్చి అబద్ధం!" అన్నాడు నగల వర్తకుడు.

అది విని మంత్రి రంగణ్ణి, "ఆ కంకణం ఇలా ఇయ్యి," అని తన చేతికి తీసుకుని, పరీక్షించి చూసి, తరవాత రాజుగారికి చూపాడు.

కొద్దిరోజుల క్రితం రాజు అడవికి వేటకు వెళ్ళి, తన కుడిచేతి కంకణం పోగొట్టుకున్నాడు. అది ఎక్కడ పడిపోయినదీ కూడా తెలియకపోవటంచేత దాని కోసం వెతికించి లాభం లేకపోయింది. ఇదే ఆ కంకణం.

రాజుగారికి ఇప్పుడు నగల వర్తకుడి ద్రోహబుద్ధి తెలిసివచ్చింది. అతన్ని మరి

కొంత పరీక్షించాలన్న ఉద్దేశంతో రాజు ఆ నగల వర్తకుడికి కంకణం చూపుతూ, "నువు పోగొట్టుకున్న కంకణం ఇదేనా?" అని అడిగాడు.

"అవును, మహారాజా!" అన్నాడు నగల వర్తకుడు, దాన్ని తనకు ఇచ్చేస్తారని ఆశ పడుతూ.

ఇంతలో మంత్రి, "దీని జత కంకణాన్ని తీసుకురా!" అన్నాడు నగల వర్తకుడితో.

వర్తకుడు ఈ మాటకు గతుక్కుమని, కొంచెం ధైర్యం తెచ్చుకుని, "మహాప్రభూ, దీని జత కంకణం ఇదివరకే పోయింది. దాన్ని కూడా ఈ రంగడే తీసి ఉంటాడని అనుమానంగా ఉంది!" అన్నాడు.

ఈ మాట విని రంగడు, "నాకేమీ తెలీదు, మహారాజా! నాకు ఒక్కటి మాత్రం తెలుస్తున్నది. పేదవాడికి దొంగతనాలు అంటగట్టటమంత తేలిక పని మరొకటి లేదు," అన్నాడు.

రాజు వాడి మాటకు నవ్వి, "ఈసారి దొంగతనం నీది కాదురా, నాది!" అంటూ తన ఎడమచేతి కంకణం తీసి అందరికీ కనిపించేటట్టు పట్టుకున్నాడు.

నగల వర్తకుడి గుండె ఆగిపోయి నట్టయింది. సభలో వారందరూ ఆశ్చర్య పోయారు.

రాజు సభికులను ఉద్దేశించి, "నేను అడవిలో నా కుడిచేతి కంకణాన్ని పోగొట్టు కున్నాను. అది ఈ రంగడికి దొరికింది. దానిని వాడు ఈ నగల వర్తకుడికి అమ్మ జూపాడు. నగల వర్తకుడికి దానిని కాజెయ్యాలన్న దుర్బుద్ధి పుట్టింది. డబ్బు లేదన్న మిష మీద ఆ కంకణాన్ని రంగడి వద్దనే ఉండనిచ్చి, వాడి మీద దొంగతనం ఆరోపిస్తూ ఫిర్యాదు తెచ్చాడు. ఈ విధంగా నగల వర్తకుడి మోసం బయట పడింది," అన్నాడు.

ఆయన నగల వర్తకుడికి తగిన శిక్ష విధించి, తాను పోగొట్టుకున్న కంకణం తనకు తిరిగి వచ్చేటట్టు చేసినందుకు రంగడికి మంచి బహుమానం ఇచ్చి పంపేశాడు.





# యక్షపర్వతం

## 4

[అరణ్యంలో వేటాడబోయిన ఖడ్గ జీవదత్తులనే క్షత్రియయువకులిద్దరూ తమ కుటీరానికి తిరిగి వచ్చి, విఘ్నేశ్వరపూజారి ద్వారా బందిపోట్లు చేసిన దుష్కార్యాల సంగతి విన్నారు. వాళ్ళు ఎటు వైపుకు పోయారో తెలుసుకుని వచ్చేందుకు నలుగురు ఖడ్గజాతివాళ్ళను, వాళ్ళ రాజైన అరణ్యమల్లు అరణ్యం కేసి పంపాడు. తరవాత—]

ఖడ్గజాతివాళ్ళు నలుగురూ తిరిగి వచ్చే లోపల వంట ముగించి, భోజనాలు చేసి ప్రయాణానికి సిద్ధంగా వుండటం మంచిదనుకుని ఖడ్గ జీవదత్తులు వంటపనుల్లో నిమగ్నులయారు. రాజు అరణ్యమల్లూ, అతడి అనుచరులూ కుటీరం ముందు బందిపోట్లను గురించి మాట్లాడుకోసాగారు.

"ఈ బందిపోట్లను పూర్తిగా తుడిచి పెట్టందే మనకు రక్షణ లేదు. మన పొలాలు పండి సిద్ధంగా వున్న తరుణంలో వాళ్ళు మరోసారి దోచుకు పోయేందుకు తిరిగి రావచ్చు," అన్నాడు అరణ్యమల్లు.

ఆ మాటలకు మంత్రి శిలాముఖి అవునన్నట్టు తల వూపి, "మహారాజా! మన వాళ్ళు ఆ బందిపోట్లను చూసిగాక, వాళ్ళు ఎక్కి వచ్చిన వింత జంతువులను చూసి ఎక్కువగా భయపడ్డారు. ఆ జంతువులు హానికరమైనవి కావని తెలుసుకున్నారు



వీళ్ళు యిలా మాట్లాడుకుంటూ వుండగా ఖడ్గ జీవదత్తులు భోజనాలు చేసి కుటీరం నుంచి బయిటికి వచ్చారు. విఘ్నేశ్వర పూజారి జీవదత్తుడితో, అరణ్యమల్లూ, యితర ఖడ్గజాతి వాళ్ళూ చేసిన ఆలోచన గురించి చెప్పాడు.

"ఈ ఆలోచన నాకు వేట నుంచి యిక్కడికి వస్తూనే కలిగింది. కాని ఆ బందిపోట్లు అప్పటికే యీ పరిసరాల నుంచి వెళ్ళిపోయారు. మన ఖడ్గమృగం కన్న దూర ప్రయాణంలో ఒంటె మూడింతలు వేగంగా పరిగెత్తుతుంది. అందువల్ల ఆ దుర్మార్గులను హతం చేయాలంటే, వాళ్ళు ఒంటెల మీది నుంచి దిగి ఏ విశ్రాంతి తీసుకుంటున్నప్పుడో చుట్టుముట్టాలి," అన్నాడు జీవదత్తుడు.

"అలాగే చేద్దాం, జీవదత్త ప్రభూ! మా వాళ్ళను నలభై యాభైమందిని వెంట బెట్టుకు పోదామా?" అన్నాడు అరణ్యమల్లు ఉత్సాహంగా.

జీవదత్తుడు నవ్వి, "అరణ్యమల్లూ, అంతమంది అనుచరులతో ఆ బందిపోట్లను అనుసరించి పోవటం ఎలా సాధ్యమవుతుంది? వాళ్ళు మన రాకను తేలిగ్గా గుర్తించి అందకుండా పారిపోతారు. అందుకని నేనూ, ఖడ్గవర్మా యిద్దరమే బయలుదేరిపోతాం. ఈ రాత్రికి వాళ్ళు ఎక్కడ విడిది చేస్తారో చూసి ముందుగా వాళ్ళ నాయ

గనక, యీసారి మనవాళ్ళు ఆ దుర్మార్గులను ఎదిరించి, హతమార్చేందుకు ఏ మాత్రం వెనుదీయరు," అన్నాడు.

"క్షత్రియయువకుల సాయం తీసుకుని యిప్పుడే మనం వాళ్ళను వెంటబడి తరిమి సర్వనాశనం చేస్తే బావుంటుంది కదా? ఈ ఆలోచనకు క్షత్రియయువకు లేమంటారో!" అన్నాడు అరణ్యమల్లు.

"యుద్ధం అంటే ఖడ్గ జీవదత్తులు నిద్రాహారాలు కూడా మానేస్తారు. యిప్పుడు ఆ బందిపోట్లు స్వర్ణాచారిని కూడా ఎత్తుకుపోయారు గదా! వాళ్ళను భోజనాలు ముగించి బయిటికి రానీయండి, చెప్పి చూద్దాం," అన్నాడు విఘ్నేశ్వరపూజారి.

కుణ్ణి హతమార్చి, తతిమ్మా వాళ్ళను పట్టు కోవటమో లేక యీ అరణ్యప్రాంతాలు వదిలి పోయేలాగానే చేస్తాం," అన్నాడు.

ఒక అరగంట కాలం గడిచీ గడవక ముందే బందిపోట్ల జాడలు తెలుసుకోవ టానికి పోయిన ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు తిరిగి వచ్చాడు. వాడెక్కి వున్న ఖడ్గమృగం ఆయాసంతో రొప్పుతున్నది.

తన అనుచరుణ్ణి చూస్తూనే అరణ్య మల్లు ఆదుర్దాగా, "బందిపోట్లు కనిపిం చారా? నీతో బయలుదేరిన తతిమ్మా ముగ్గురూ ఏమయారు?" అని అడిగాడు.

ఖడ్గజాతివాడు నాలుగు మాటల్లో సంగతి సందర్భాలన్నీ చెప్పేశాడు. అతడూ అతడి అనుచరులు ముగ్గురూ కొండవాగును చేరే సరికే బందిపోట్లు వాగును దాటి ఉత్తర దిశగా వెళ్ళిపోతున్నారు. వాళ్ళ కంట బడ కుండా ఖడ్గజాతివాళ్ళు బందిపోట్లను కొంత దూరం అనుసరించి పోయి, వాళ్ళు కొండ పాదాన్ని ఆనుకుని ప్రవహిస్తున్న నదీ తీరాన్ని అంటి పెట్టుకుని పోతున్నట్టు గ్రహించారు. ఆ సంగతి చెప్పేందుకు ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకడు ముందుగా యిక్కడికి పరుగుల మీద వచ్చాడు.

"తతిమ్మా మన వాళ్ళు బందిపోట్ల వెన్నంటి పోతున్నారా?" అని అడిగాడు జీవదత్తుడు.



"పోతున్నారు, దొరా! మనం పోయి వాళ్ళను కలుసుకునేవరకూ, వాళ్ళు బంది పోట్లను కనుమరుగు కాకుండా చూస్తూనే వుంటారు," అన్నాడు ఖడ్గజాతివాడు.

జీవదత్తుడు ఓ క్షణకాలం మౌనంగా వూరుకుని ఖడ్గవర్మతో, "ఖడ్గా, యిక మనం బయలుదేరవచ్చు. సూర్యాస్తమయం తర వాతే మనం ఆ బందిపోట్లు వున్న ప్రదేశాన్ని చేరటం మంచిది. ఆ తరవాత అవకాశాన్ని బట్టి వాళ్ళ అంతుతేలుద్దాం. స్వర్ణాచారిని యీ రాత్రికే విడిపించుకురావాలి," అన్నాడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు తమ తమ కత్తులూ, విల్లంబులూ తీసుకుని ప్రయాణా నికి ఖడ్గమృగాలను ఉపయోగిద్దామా అను



కునేంతలో విఘ్నేశ్వరపూజారి హఠాత్తుగా ఏదో గుర్తు కొచ్చిన వాడిలా ఎగిరిపడి, "క్షత్రియ యోధుల్లారా, మీరు ఆ బంది పోట్లను సునాయాసంగా వెంబడించి పోవ టానికి వాళ్ళు ఉపయోగించిన వాహనాన్నే వాడుకోవచ్చు. మన సింహం చంపిన బంది పోటు వాడి ఒంటె యీ ప్రాంతాలనే ఎక్కడో వుంటుంది, వెతికించండి!" అన్నాడు.

ఆ మాట వింటూనే అరణ్యమల్లు తన అనుచరులతో, "నిజమే, ఆ వింత జంతువు మాట మరిచాం. అది కుటీరం వెనకనే ఎక్కడో చెట్ల కింద మేస్తూ వుంటుంది. వెళ్ళి పట్టుకు రండి," అన్నాడు.

ఆ వెంటనే నలుగురు ఖడ్గజాతివాళ్ళు కుటీరం వెనక వున్న అరణ్యంలోకి పోయి పావు గంటకాలం గడిచీ గడవకముందే ఒంటెను వెతికి పట్టుకుని ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వచ్చారు. ఖడ్గ జీవదత్తులు ఒంటె మీద ప్రయాణమయారు. అంతకు ముందు బందిపోట్లను గురించి సమాచారం తెచ్చిన ఖడ్గజాతివాడు ముందుండి దారి తీయగా, సూర్యాస్తమయ సమయంలో వాళ్ళు బంది పోట్లను నదీ ప్రాంతంలో గల ఒక కొండ పక్కన చూశారు. ఈ లోపల ఖడ్గ జీవదత్తు లకు మిగిలిన ముగ్గురు ఖడ్గజాతివాళ్ళూ కనిపించి వాళ్ళతోబాటే బయలుదేరారు.

చీకటి పడే సమయానికి బందిపోట్ల నాయకుడు తన అనుచరులను నదీతీరంలో ఆ రాత్రికి మజిలీ ఏర్పాటు చేయవలసిం దిగా ఆజ్ఞాపించాడు. బందిపోట్లందరూ తమ వాహనాలు దిగి, ఒంటెలను దాపులనున్న చెట్లకు కట్టివేసి వంట పనులు ప్రారంభిం చారు. వాళ్ళల్లో కొందరు ఎండు పుల్లల కోసం అడవి చెట్లలోకి వెతకబోయారు.

ఖడ్గ జీవదత్తులు, తమ వెంట వున్న నలుగురు ఖడ్గజాతి వాళ్ళతో బందిపోట్లకు కనబడకుండా కొంచెం దూరంగా వున్న గుబురు చెట్లచాటున దాక్కుని, స్వర్ణాచారి కోసం బందిపోట్లు మజిలీ చేసిన ప్రాంతాన్ని పరీక్షగా చూడసాగారు. స్వర్ణాచారి బంది



పోట్ల మధ్య ఎక్కడా వాళ్ళకు కనిపించ లేదు. ఆ దుర్మార్గులు అతణ్ణి దారిలోనే ఎక్కడైనా చంపి పారవేశారా అన్న అనుమానం జీవదత్తుడికి కలిగింది.

"ఖడ్గా, స్వర్ణాచారి ఎక్కడా కనిపించటం లేదు. ఒకవేళ యీ దుర్మార్గులు అతణ్ణి చంపివేసి వుండరు గదా?" అన్నాడు జీవదత్తుడు.

ఆ ప్రశ్నకు ఖడ్గవర్మ తల అడ్డంగా ఆడించి, "అలా జరిగి వుండదు. స్వర్ణాచారి జిత్తులమారి నక్క. వీళ్ళను మోసగించి పారిపోయి వుంటాడని నాకు అనుమానం కలుగుతున్నది. కాని, అతణ్ణి గురించిన నిజం తెలుసుకోవటం చాలా సులభం. నువ్విక్కడే వుండు, యిప్పుడే వస్తాను," అంటూ కత్తి దూసి బయలుదేరాడు.

జీవదత్తుడు అతణ్ణి ఆపి, "ఏం చేయబోతున్నావు?" అని అడిగాడు.

"ఎండు పుల్లల కోసం నదీ తీరం నుంచి అరణ్యంలోకి కొందరు బందిపోట్లు వచ్చారు గదా. వాళ్ళల్లో ఒకణ్ణి ప్రాణాలతో పట్టుకుంటే సంగతి సందర్భాలన్నీ తెలిసిపోతవి," అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కొంచెం ఆలోచించి, "ఈ ఎత్తుగడ బాగానే వున్నది. వెంట ఒక ఖడ్గజాతి వాణ్ణి కూడా తీసుకుపో. మనం యిక్కడ దాగి వున్న సంగతి మాత్రం ఆ దుర్మార్గులకు తెలియకుండా పని పూర్తి చేసుకురావాలి," అని హెచ్చరించాడు.

ఖడ్గవర్మ, ఒక ఖడ్గజాతి వాణ్ణి వెంట తీసుకుని చెట్లల్లో ఎండు పుల్లలు వెతుకుతున్న బందిపోట్లల్లో ఒకణ్ణి పట్టుకునేందుకు బయలుదేరాడు. అతడికి త్వరలోనే అలాంటివాడు ఒకడు కనిపించాడు. కాని వాడు తనను చూసి అనుచరులను హెచ్చరించక ముందే గొంతు నొక్కి పట్టుకోవాలి!

ఖడ్గవర్మ ఒక ఉపాయం ఆలోచించాడు. బందిపోటువాడు చెట్లకింద పడివున్న ఎండు పుల్లలను పోగు చేయటమే కాక, ఎండినవని అనుమానం కలిగిన చెట్లకొమ్మలను కూడా బలంగా లాగి విరుస్తున్నాడు.



ఖడ్గవర్మ, తన వెంట వున్న ఖడ్గజాతి వాణ్ణి హెచ్చరించి, వాడి చేత ఒక పెద్ద ఎండు కొమ్మను చెట్టు నుంచి విరిపించి, అది దభీమని కింద పడుతూండగానే పరి గెత్తి వాడితోపాటు దగ్గిర వున్న ఒక చెట్టు వెనక దాక్కున్నాడు. ఎండుకొమ్మ విరిగి పడినశబ్దం వింటూనే బందిపోటువాడు దాన్ని ఎత్తుకు పోయేందుకు అక్కడికి వచ్చాడు. వాడున్న అవసరంలో వాడికి అంత పెద్ద ఎండుకొమ్మ దానికై అది చెట్టు నుంచి విరిగి ఎందుకు పడుతుందా అన్న అను మానం కలగలేదు.

బందిపోటువాడు వంగి ఎండుకొమ్మను కదిలించబోయే సమయంలో ఖడ్గవర్మ వెనక నుంచి వచ్చి మీదపడి, వాడి గొంతును రెండు చేతులతో బలంగా పడిసి పట్టు కున్నాడు. అదే సమయంలో ఖడ్గజాతివాడు అక్కడికి వచ్చి, ఈటెను వాడి గుండెకు గురి చేసి నోరెత్తితే ఈటెతో పొడుస్తానని సౌంజ్ఞ చేశాడు.

ప్రాణభయంతో గడగడ వణికిపోతున్న బందిపోటును మెడపట్టుకుని లేపి నిలబెట్టి ఖడ్గవర్మ వాడితో, "నోరెత్తకుండా నా వెంట రా. నీ కెలాంటి ప్రాణ హానీ కలగదు. కాని, అరిచి నీ అనుచరులను హెచ్చరించ ప్రయత్నించావో — నిన్నిక్కడే నిలువునా నరికేస్తాను," అన్నాడు.

బందిపోటువాడు కుక్కిన పేనులా అయిపోయి ఖడ్గవర్మ వెంట బయలు దేరాడు. ఖడ్గవర్మ తెచ్చిన బందిపోటును చూసి జీవదత్తుడు చాలా సంతోషించి, "సునాయాసంగా శత్రువును పట్టినట్టు న్నావు! స్వర్ణాచారిని గురించిన సమాచారం ఏమైనా చెప్పాడా?" అని అడిగాడు.

"నేనింతవరకూ వాణ్ణి ఎలాంటి ప్రశ్నా అడగలేదు. ఈ చుట్టుపక్కల ఇంకా కొందరు వీడి అనుచరులు తిరుగుతున్నారు. అందుకని వీణ్ణి సరాసరి నీ దగ్గిరకు తెచ్చాను," అన్నాడు ఖడ్గవర్మ.

"ఒరే, కొండవాగు దగ్గిర మీరు పంట పొలాలు దోచుకున్నారు గదా, ఆ సమ

యంలో అక్కడ మీరు పట్టుకున్న స్వర్ణా చారి అనే ఆతన్ని ఏం చేశారు?" అని అడిగాడు జీవదత్తుడు, బందిపోటును.

"నిజంచెపితే నన్ను ప్రాణాలతో వదిలే స్తారా?" అన్నాడు బందిపోటు వణుకుతూ.

"తప్పకుండా వదులుతాం. కాని, అబద్ధాలు చెప్పి మమ్మల్ని మోసగించ చూశావో, నిన్ను ముక్కలు ముక్కలుగా నరుకుతాం, తెలిసిందా?" అన్నాడు జీవ దత్తుడు కోపంగా.

"అయ్యో, ఆ ఆచారి దారిపొడుగునా 'రక్షించండి!' అంటూ కేకలు పెట్ట సాగాడు. మా నాయకుడికి అతణ్ణి చంపటం యిష్టంలేదు. అందుకని వాణ్ణి జొన్నకంకు లున్న గోతాంలో గొంతు వరకూ దూర్చి, గోతాం మూతి బిగించాడు. ఇప్పుడు వాడు నది ఒడ్డున మేం దించిన సామానుల్లో పడి వున్నాడు," అని చెప్పాడు బందిపోటు.

"ఈ రాత్రికి మీరుండబోయే చోటు యిదే గదా! తెల్లవారి తిరిగి ప్రయాణం ప్రారం భిస్తారు, అవునా?" అని అడిగాడు జీవ దత్తుడు.

"అవును. ఇక నాకు ప్రాణహాని కలి గించరు గదా? అంతా నిజం చెప్పాను," అన్నాడు బందిపోటు.

"నువ్వు చెప్పిన దాంట్లో వున్న నిజా నిజాలు తెలుసుకునే వరకూ నిన్నిక్కడే



ఒక చెట్టుకు కట్టివేసి వుంచుతాం. నోరెత్తి అరవకుండా వుండేందుకు యిన్ని చెట్ల ఆకులు నీ నోట కుక్కక తప్పదు!" అని జీవదత్తుడు పక్కన వున్న ఒక ఖడ్గజాతి వాడికి సౌంజ్ఞ చేశాడు.

ఖడ్గజాతి వాడు, బందిపోటును దూరంగా తీసుకు పోయి ఒక చెట్టు బోదెకు గట్టిగా అడవి తీగతో కట్టవేశాడు. ఆ సరికి బాగా చీకటి పడిపోయింది. ఖడ్గ జీవదత్తులు ఒక చెట్టు మీదికి పోయి బందిపోట్లు విడిది చేసిన ప్రాంతాన్ని పరీక్షగా చూడసాగారు. ఒక చోట చిన్న నెగడు వెలిగింది. దాని ముందు బందిపోట్ల నాయకుడు కూర్చుని. చుట్టూ చేరిన నలుగురైదుగురు అనుచరు

లతో ఏదో మాట్లాడుతున్నాడు. తతిమ్మా బందిపోట్లు తిండి తిని నిద్రించేందుకు చాపలూ, గోతాలూ నేల మీద పరుచు కుంటున్నారు.

"ఖడ్గా, మరి కాస్త పొద్దు పోనిచ్చి మన దాడి ప్రారంభిద్దాం. ముందుగా స్వర్ణాచారిని బంధవిముక్తుణ్ణి చేయాలి. ఆ తరవాత మన ఖడ్గజాతి వాళ్ళను పంపి ఒంటెలను యిక్క ణ్ణించి తరిమి వేయాలి. తరవాత ఖడ్గ మృగాలను ఎక్కి మనం బాణాలు కొడుతూ బందిపోట్ల మీద పడి, వాళ్ళు నిద్ర నుంచి లేచే లోపలే అందిన వాళ్ళను నరికి, మిగతా వాళ్ళను చెల్లా చెదురు చేద్దాం," అన్నాడు జీవదత్తుడు.

"బావుంది. అన్నిటికన్న ముఖ్యం స్వర్ణా చారిని విడిపించటం. ఆ తరవాత ..." ఖడ్గ వర్మ మాట మధ్యలోనే ఆగిపోయి, ఎక్కడ లేని ఆశ్చర్యంతో బందిపోట్లు విడిది చేసిన చోటుకు దాపులనున్న కొండ కేసి చేయి ఊపుతూ, "జీవా, అదేమిటి? ఆ కొండ గుహలో కాగడా వెలుగు చూశావా? శరీర మంతా జడల మయంగా వున్న ఆ వికృతా కారు డెవరు? వాడిని మంత్రదండంతో కొడుతున్నవాడు అంతకన్న కూడా వికృ తంగా వున్నాడే!" అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ చెప్పిన గుహ కేసి దృష్టి సారించాడు. ఖడ్గవర్మ చెప్పిన విధంగా గుహలో ఒక కాగడా వెలుగు తున్నది. దాని వెలుగులో శరీరమంతా పొడవాటి జడలు వేలాడుతున్న వికృతా కారు డొకడూ, నల్లని వస్త్రం ధరించి చేత గల మంత్ర దండాన్ని బందిపోట్ల కేసి వూపుతున్న మాంత్రికు డొకడూ కనిపించారు.

ఖడ్గ జీవదత్తులు అమితాశ్చర్యంతో ఆ వింత మానవులకేసి చూస్తూండగానే శరీరమంతా జడలు గల వికృతాకారుడు, కొండలూ, అరణ్యం మార్మోగేలా పెద్దగా ఒక కేక పెట్టి, గుహలో నుంచి బయటికి దూకి బందిపోట్ల కేసి పరిగెత్తుకు రాసా గాడు. అతడి నుదుటి మీద నిప్పుకణంలా ఏదో వెలుగుతూ ఆరిపోతున్నది. చేతిలో తెల్లని గద వున్నది. —(ఇంకావుంది)





# ప్రజాభిమాని

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా! లోకుల మెప్పు కోరి నువ్వు ఇలా ఈ అపరాత్రి వేళ శ్రమ పడుతున్న పక్షంలో, లోకులు విచక్షణ లేని వారనీ, వారు తమకు మేలు చేసిన వారినే నిందించగలరనీ తెలుసుకో. ఇందుకు నిదర్శనంగా నీకు హిమశేఖరుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం సువర్ణదేశాన్ని హిమశేఖరుడు పాలించాడు. ప్రజలను సుఖపెట్టటం ఆయనకు పెద్ద వ్యసనంగా ఉండేది. తాను ఏయే చర్యలు చేస్తే ప్రజలకు జీవితం మరింత సుఖంగా ఉంటుందా అని అస్తమానమూ ఆలోచిస్తూ, ఎప్పుడూ ఏదో ఒక ప్రజోప

## బేతాళ కథలు



యోగం కొనసాగిస్తూనే ఉండేవాడు. రాజ్యంలో ఏదో ఒక మూల చెరువులు తవ్వటమో, బావులు తవ్వటమో, దారులు వెయ్యటమో, ఉన్న దార్ల వెంబడి చెట్లు నాటటమో, కొత్త సత్రాలూ, ఆలయాలూ, పూలతోటలూ నిర్మించటమో జరుగుతూనే ఉండేది. ప్రజల కోసం ఎన్ని సౌకర్యాలు ఏర్పరచినా రాజుకు తృప్తి అన్నది ఉండేది కాదు, ఇంకా చేయవలసినవి ఎన్నో ఉన్నట్టు భావించి, వాటిని ఊహించటానికి తపన పడేవాడు.

తన ప్రయత్నాలు ఎంతవరకు ఫలించినదీ తెలుసుకోవాలని హిమశేఖరుడికి ఒకసారి కోరిక కలిగింది. ప్రజలు ఏమనుకుంటున్నదీ చారులు ఆయనకు చెబుతూనే వున్నారు. "మహారాజా, తమ పరిపాలనలో తమకు ఏ లోటూ లేదనీ, సువర్ణదేశం కన్న భూలోకస్వర్గం మరొకటి లేదనీ ప్రజలు అనుకుంటున్నారు. తమ పరిపాలన వెయ్యి కాలాలపాటు సాగాలని వాళ్ళు దేవుళ్ళకు దణ్ణాలు పెడుతున్నారు," అని, దేశం నలుమూలలా తిరిగివచ్చిన చారులు రాజుతో రోజూ చెబుతూనే ఉన్నారు.

అయినా, ప్రజలు ఏయే విషయాలను గురించి అసంతృప్తి పడుతున్నారో, వారికి తృప్తి కలిగించటానికి తాను ఇంకా ఏమేమి పనులు చెయ్యవచ్చునో స్వయంగా తెలుసుకుందామని రాజు ఒకనాడు మారువేషం వేసుకుని రాజధాని నగరంలో తిరగనారంభించాడు.

నగరంలో ప్రజలు తమ తమ పనులు చూసుకుంటూ ఉండడమే ఆయనకు కనిపించింది, కాని వాళ్ళకుండిన ఇబ్బందులేవో చాలాసేపు తెలియరాలేదు. చివరకు ఆయన, ఒక చోట చేరిన నలుగురైదుగురు లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ ఉండడం గమనించి, వారిని సమీపించాడు.

"ఇతర దేశాల వాళ్ళు మన దేశాన్ని చాలా మెచ్చుకుంటున్నారు, మన దేశంలో ప్రతి ఒకడూ రాజేనంటున్నారు," అన్నాడు వారిలో ఒకడు.

"వాళ్ళు రాజుగారి లోగిలి చూస్తే ఆ మాటనరు. ఆయన భోగాలెక్కడ? ఆయన ఎక్కడ? రెండు చెరువులు తవ్వగానే మన మంతా రాజులమైపోతామా? అందరూ గొప్పగా చెప్పుకోవాలని రాజులు బావులు తవ్విస్తారు. సత్రాలు కట్టిస్తారు. అంత మాత్రం చేతనే మనమంతా సర్వసుఖాలూ అనుభవిస్తూ, రాజులమైపోయినట్టేనా?" అన్నాడు మరొకడు.

మిగిలిన వాళ్ళంతా, వాడి మాటలకు ఆమోదం తెలుపుతూ, "నిజం, నిజం!" అన్నారు.

ఈ సంభాషణ విని రాజు తలవంచుకుని ముందుకు సాగిపోయాడు. తాను తలపెట్టిన ప్రజోపయోగాలన్నీ తన కీర్తి కోసం చేసినవే నని ప్రజలు అనుకుంటున్నారు! ప్రజల సౌఖ్యం కోసం తాను పడిన ఆరాటమంతా బూడిదలో పోసిన పన్నీరయింది! తన ఆరాటం మూలంగా ప్రజలకు అదనపు సంతృప్తి ఏమీ కలగలేదు. అందుచేత తాను యింతటితో ప్రజాహిత కార్యకలాపాలు కట్టిపెట్టి, నిశ్చింతగా వుండవచ్చునని రాజు నిశ్చయించుకున్నాడు.

కొంతకాలం గడిచింది. ఆయేడు వర్షాలు కురవలేదు. చేలు ఎండిపోయాయి. చెరువులలో నీటిచుక్కలేదు. కాటకం వచ్చింది. తిండి కొరత ఏర్పడి సువర్ణదేశ ప్రజలు ఆకలితో అలమటించసాగారు.

ప్రజల కష్టాలను రాజు చూడలేక పోయాడు. ఆయన గుండె ద్రవించి



పోయింది. రాజు వెంటనే తన గాదెల నుంచి ధాన్యం తీయించి అన్నసత్రాలు ఏర్పాటు చేశాడు. తన ఖజానా నుంచి అంతులేని ధనం పైకి తీసి దూరప్రాంతాల ధాన్యం కొనుగోలు చేసి తెప్పించాడు.

తన సిబ్బంది ప్రజలకు అన్నదానం సరిగా చేస్తున్నదీ లేనిదీ తెలుసుకునేటందుకు రాజు మారువేషం వేసుకుని గ్రామాలన్నీ తిరగసాగాడు.

ఈసారి ఆయనకు ప్రజలు అనుకునే మాటలు మరో విధంగా వినిపించి, ఆశ్చర్యం కలిగింది.

"ఆహా, మన రాజులాటి వాడు కోటి మందిలో ఒకడు ఉంటాడా? మనం ఏ జన్మలోనో చేసుకున్న పుణ్యం చేత ఇటువంటి రాజు దొరికాడు! మన పాలిటి దేవుడు!" ఇలాటి మాటలు ఎన్నో వేలమంది నోళ్ళ వెలువడుతున్నాయి.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, హిమశేఖరుడు మొదటి నుంచీ ప్రజల సుఖం కోసం పాటుపడిన వాడేగదా, ఆయనను గురించి ప్రజలు మొదట తేలికగా ఎందుకు మాట్లాడారు? తరవాత వాళ్ళే ఆయనను ఆకాశానికి ఎందుకు ఎత్తారు? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హిమశేఖరుడు ప్రజల సుఖాలను పెంపొందించి ఉండవచ్చు గాని, అవి వారు కోరిన సుఖాలు కావు. రాజు వారి కష్టాలను తీర్చినవాడు కూడా కాలేదు. కోరకుండా జరిగే మేలును ఎవరూ మెచ్చుకోరు. అయాచితంగా లభించిన సుఖాలు ఆనందాన్ని చేకూర్చవు. కాని కాటకం వచ్చినాక ప్రజలు తమ కష్టాలను గుర్తించి, వాటిని తొలగించిన రాజును హర్షించారు. అందుకు గాను వారు రాజు పట్ల కృతజ్ఞత చూపి, ఆయనను ఆకాశానికి ఎత్తారు. ఇందులో వింత ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# పతివ్రత

అర్మీనియా దేశంలో ఒక నిరుద్యోగి ఉండే వాడు. అతని భార్య అందమైనది.

అతను తన భార్యతో, "నేను దేశాంతరం వెళ్ళి డబ్బు సంపాదించుకుని వస్తాను," అని చెప్పి, తన భార్యకూ, బిడ్డలకూ అండగా ఉండమని తన తమ్ముడితో చెప్పి, ఇంటి నుంచి బయలుదేరి, దొరికినచోట నౌకరీ చేస్తూ, చాలా కష్టాలుపడి డబ్బు సంపాదించసాగాడు.

అతని భార్య తన మరిదికి శ్రద్ధగా పోషణ చేస్తూ, వాడికోసం ఎంతో శ్రమపడుతూ వచ్చింది. వాడు తన వదినెగారి మీద కన్ను వేశాడు, కాని వాడి ఎత్తులు పారలేదు. ఆమె పతివ్రత.

మూడేళ్ళు గడిచినాక భర్త తాను డబ్బుతో తిరిగి వస్తున్నట్టు కబురు చేశాడు. అతను వచ్చేనాడు తమ్ముడు ఎదురు వెళ్ళి, పొలిమేర దగ్గిరి అన్నను కలుసుకున్నాడు.

"నా భార్యా, బిడ్డలూ ఎలా ఉన్నారు?" అని అన్న తమ్ముణ్ణి అడిగాడు.

"ఆవిడ నీ భార్య అని చెప్పుకోవటం సిగ్గు చేటు. ఆమె సిగ్గూ, బిడియమూ పూర్తిగా వదిలేసింది. అంతా నీకే తెలుస్తుంది," అన్నాడు తమ్ముడు.

ఇద్దరూ ఇంటికి వచ్చారు. భార్య భర్త రాకకు సంతోషించి అతని కాళ్ళు కడిగి, చెయ్యవలిసిన సేవలు అన్నీ చేసింది. కాని భర్త ముభావంగా ఉండిపోయాడు. వాళ్ళు భోజనాలు చేస్తూ ఉండగా పిల్లలు కొందరు వచ్చి, వాళ్ళ ఇంటి మీద రాళ్ళు వేసి, ఇంటి ఆడమనిషిని నానాతిట్లూ తిట్టసాగారు. వారిని అలా చెయ్యమని తమ్ముడే ప్రోత్సహించాడు. అతనే బయటికి వెళ్ళి, ఆ కుర్రవాళ్ళను కసిరి పంపేశాడు.

తన భర్తనోట మాటా పలుకూ లేక పోవటం భార్యకు కష్టం కలిగించింది. తన

అర్మీనియా జానపద కథ



భర్త తగినంత డబ్బు సంపాదించలేక పోయాడేమో నని ఆమె అనుకున్నది. కొద్ది రోజులపాటు భర్త ఒకమూల కూర్చుని మౌనవ్రతం పట్టి, చివరకు ఒకనాడు తన వెంట ఆమెను అడవిలోకి తీసుకుపోయి, అక్కడ ఆమెను హత్యచేసి, ఆమె శవాన్ని అక్కడే వదిలేసి, నిశ్చింతగా ఇంటికి వెళ్ళి పోయాడు.

టర్కీ వర్తకుడు ఒకడు తన బిడారుతో అటుగా వెళ్ళుతూ, ఆమె శవం పడి ఉన్న ప్రాంతంలోనే మజిలీ చేశాడు. అక్కడ అతనికి ఒక సెలయేరు కనిపించింది. అతను అటుగా ఎన్నోసార్లు వెళ్ళాడు గాని, అక్కడ ఆ సెలయేరు లేదు. దాని సమీపంలోనే ఎవరో ఆడదాని శవం కూడా కనిపించింది.

"నీతిమాలిన భార్యను భర్త చంపేసి ఉంటాడు!" అనుకున్నాడు టర్కీ వర్తకుడు.

అతని పరివారం వాళ్ళు నిప్పు చేసి వంట ప్రారంభించారు. వారివద్ద ఉప్పు చేపలు మాత్రమే ఉన్నాయి. సెలయేటి నుంచి నీరు తెచ్చి, అందులో చేపలను వెయ్యగానే, వాటికి ప్రాణం వచ్చి, అటూ ఇటూ ఈదసాగాయి.

సెలయేటి నీటిలో ప్రాణంపోసే మహత్తు ఉన్నట్టు వాళ్ళకు అనుమానం కలిగి, ఆ నీటిని కడవలతో తెచ్చి శవం మీద పోశారు. వెంటనే, చచ్చిపోయిన మనిషి బతికి, లేచి కూర్చున్నది.

వర్తకుడు తన కళ్ళను తానే నమ్మలేక, "ఎవరు నువు?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

ఆమె ఏడుస్తూ తన కథ చెప్పింది.

"నాకు భార్యలేదు. నా వెంటరా, నిన్ను పెళ్ళాడి సుఖ పెడతాను," అన్నాడు వర్తకుడు.

"నేను ఇదివరకే ఒకరి భార్యను," అన్నదామె.

వర్తకుడు ఎన్నివిధాల చెప్పినా ఆమె వినిపించుకోక, తనను చంపినవాడే తన

భర్త అనీ, తాను అతని ధర్మపత్ని ననీ వాదించింది.

"తరవాత విచారిస్తావు!" అని వర్త కుడు బెదిరించాడు.

"అది కలలోమాట!" అన్నదామె ఏమీ భయపడకుండా.

వర్తకుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను తన మనుషుల చేత నలభై మూరల లోతు గుంట తవ్వించి, అందులో ఆమెను తోయించి, పైన పెద్ద బండరాయి మూత వేసి, మర్నాడు తెల్లవారు ఝామున తన బిడారుతో సహా ఆ ప్రదేశం వదిలి వెళ్ళి పోయాడు.

మర్నాడు ఆ ప్రదేశానికి టర్కీ నుంచి మరొక బిడారు వచ్చి విడిసింది. దాని యజమాని అయిన వర్తకుడు, "ఎక్కడో ఆడది సన్నగా ఏడుస్తున్నట్టు వినిపిస్తున్నది. వెళ్ళి చూడండి," అని తన మనుషులతో అన్నాడు. వాళ్ళు వెళ్ళి, గుంట మీది రాయి తీసి, దానినుంచి ఒక చక్కని స్త్రీని తాళ్ళ సహాయంతో పైకి తీసి, వర్తకుడి వద్దకు తెచ్చారు.

వర్తకుడు ఆమె అందమూ, యౌవనమూ చూసి నిర్ఘాంతపోయి, "ఎవరు నువు?" అని అడిగాడు.

ఆమె తన కథ చెప్పింది.

"నన్ను పెళ్ళాడు. నీ కష్టాలు తీరి పోతాయి," అన్నాడు వర్తకుడు.

"క్షమించండి. నేను అదివరకే ఒకరి ధర్మపత్నిని," అన్నదామె.





"నిన్ను చంపినవాడింకా నీ భర్తే నంటావా?" అని వర్తకుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"మీకు లోకజ్ఞానం ఉన్నది. ఆడదాన్ని ఎలా చూడాలో తెలియాలి. నాకు ఆకలి దహించుకు పోతున్నది," అన్నదామె.

వర్తకుడు ఆమెను తన గుడారంలోకి తీసుకుపోయి, ఆమెకు భోజనం పెట్టించాడు. ఆమె భోజనం చేసి గుడారం బయటికి పోతూ, "ఇప్పుడే వస్తాను," అని వర్తకుడితో అని, చీకట్లోపడి ఎటో వెళ్ళిపోయింది.

ఆమె తిరిగివస్తుందని చాలాసేపు చూసిన మీదట ఆమె పారిపోయిన సంగతి వర్తకుడికి అర్థమయింది.

ఆ తరవాత ఆమెకు తారసిల్లినవాడు కుర్ద్ జాతికి చెందిన గొర్రెలకాపరి. అతను ఆమెకు పాలూ, రొట్టె ఇచ్చి, తనదాన్ని చేసుకోవాలని చూశాడు. అతని బారి నుంచి తప్పించుకునేటందుకు ఆమె ఒక నదీప్రవాహంలోకి దూకి అందులో కొట్టుకుపోయింది.

ప్రవాహం ఆమెను సముద్రంలోకి చేర్చింది. అక్కడ ఒక బెస్తవాడు ఆమెను రక్షించి, తన ఇంటికి తెచ్చాడు. బెస్తవాడి తల్లి ఆమెకు వేన్నీళ్ళతో స్నానం చేయించి, తన పాతబట్టలు కట్టుకోవటానికి ఇచ్చింది.

బెస్తవాడు ఆమె కథ అంతా అడిగి తెలుసుకుని, "నాకు భార్య లేదు. నన్ను పెళ్ళాడతావా?" అని అడిగాడు.

"నేను అదివరకే ఒకరి భార్యను గద. అభ్యంతరం లేకపోతే నీకు చెల్లెలుగా ఉంటాను," అన్నదామె.

"నీ యిష్టం," అన్నాడు బెస్తవాడు.

అది మొదలు బెస్తవాడికి సముద్రంలో వలవేసినప్పుడల్లా ముత్యపుచిప్పలు దొరికాయి. వాటిలో పెద్దపెద్ద ముత్యాలున్నాయి. వాటిని తీసుకుపోయి నగరంలోని నగల వర్తకులకు అమ్మగా బోలెడంత బంగారం వచ్చింది.

అంత బంగారం చూసి వాడికి మతి పోయినట్టయింది. తిండికి తరుగులేకుండా ఉండగలందులకు ఆ బంగారమంతా పెట్టి

ధాన్యం కొనసాగాడు. ఆ ధాన్యం నిలవ చెయ్యటానికి పెద్దపెద్ద కొట్లు గల భవంతి కట్టించాడు.

కొద్దికాలానికే ఆ ప్రాంతంలో భయంకరమైన కరువు ఏర్పడింది. ఆకలితో జనం అల్లాడిపోయారు. బెస్తవాడు తన ధాన్యపు కొట్లు తెరిచి, ధాన్యం పంచసాగాడు. అన్నార్తులకు ధాన్యం పంచిపెట్టటంలో అతనికి ఆమె కూడా తోడ్పడింది. ఆమె మగవాడి దుస్తులు ధరించి, ఆకలితో వచ్చినవారి నందరినీ జాగ్రత్తగా చూసుకున్నది.

ఒకనాడు ఆమె భర్తే వచ్చి, "నేనూ, నా పిల్లలూ తిండికి మాడుతున్నాం. కాసిని గింజలు ఇప్పించండి." అని ఆమెను వేడుకున్నాడు.

"ఆ గదిలో కాస్సేపు కూర్చోండి. వీళ్ళ సంగతి చూసి వస్తాను," అన్నదామె తన భర్తతో. అతను ఆమెను గుర్తించలేదు. తన భార్య చచ్చిపోయిందనే అతని నమ్మకం.

ఆ రోజే టర్కీ వర్తకులిద్దరూ, కుర్ద్ జాతి గొర్రెలకాపరీ కూడా తిండి గింజలు యాచిస్తూ వచ్చారు.

తీరిక కలగగానే ఆమె వీరు నలుగురూ ఉన్నచోటికి వచ్చి, వాళ్ళు ఎవరో, ఎక్కడి నుంచి వస్తున్నారో అడిగింది. వాళ్ళు ఉన్న మాట చెప్పారు.



ఆమె మొదటి టర్కీ వర్తకుడి కేసి తిరిగి, "మీరు చాలా వింతలు చూసి ఉంటారు. మాకు కొన్ని వింతలు చెప్పండి," అని అడిగింది.

"నేను చూసిన అద్భుతం ఏమంటే ఒక చచ్చినమనిషి బతకటం!" అంటూ అతను తనకు పతివ్రతతో కలిగిన అనుభవం చెప్పి, తాను ఆమెను అరణ్యంలోని ఒక గోతిలోకి తోసిన సంగతి కూడా బయట పెట్టేశాడు.

వెంటనే రెండో టర్కీ వర్తకుడు, ఆ గోతిలో మనిషిని తాను కాపాడిన సంగతీ, ఆమె తనను పెళ్ళాడ నిరాకరించి పారిపోయిన సంగతీ చెప్పాడు.

తరవాత గొర్రెలకాపరివాడు, "నేను చూసిన మనిషి ఆమే అయి ఉంటుంది. నన్ను పెళ్ళాడమంటే తాను మరొకరి భార్యను అని చెప్పి, నేను బలాత్కరించ బోగా పరిగెత్తిపోయి నదిలో దూకేసింది," అన్నాడు.

తరవాత ఆమె తన భర్త కేసి తిరిగి, "మీ కథ ఏమీ చెప్పలేదే? చెప్పండి, వింటాను," అన్నది.

అతను నిట్టూర్చి, "ఏం చెప్పను? నా భార్యను నేను చేజేతులా చంపు కున్నాను," అన్నాడు.

"ఎందుకు చంపవలిసి వచ్చింది? అంత ఘోరం ఏం జరిగింది?" అని అడిగింది భార్య.

"నేను డబ్బు సంపాదించటానికి దేశం కాని దేశాలలో మూడేళ్ళపాటు నానా అగ చాట్లూపడి ఇంటికి తిరిగి వచ్చేసరికి, నా భార్య నీతిమాలినదని నా తమ్ముడు చెప్పాడు. అందుకని ఆమెను చంపేశాను. ఆమె ఏ తప్పూ చెయ్యలేదని తరవాత తెలిసింది. అది మొదలు పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాను," అన్నాడు.

"మీ భార్య మీకు కనిపిస్తే ఆమెను గుర్తిస్తారా?" అని భార్య అతన్ని అడిగింది.

"తప్పక గుర్తిస్తాను," అన్నాడు భర్త.

ఆమె ఏదో వంకపెట్టి అవతలికి వెళ్ళి, తన మామూలు వేషంతో తిరిగి వచ్చింది. ఆమెను చూస్తూనే వర్తకులూ, గొర్రెలకాపరీ కూడా గుర్తించారు.

భర్త ఆమె కాళ్ళపైనపడి, ఏడుపు గొంతుతో, "నీకు ద్రోహం చేశాను, క్షమించు!" అన్నాడు.

"నేను ఈ రోజుకోసమే బతికి ఉన్నాను," అన్నదామె.

మిగిలిన ముగ్గురు కూడా ఆమెకు క్షమాపణలు చెప్పుకుని, తిండి గింజలు తీసుకుని వెళ్ళిపోయారు.

"నేను ఇంటికి తిరిగిరాను. మీరు వెళ్ళి మన పిల్లలను తీసుకురండి," అన్నదామె తన భర్తతో. తరవాత వాళ్ళు బెస్తవాడితోనే ఉంటూ సుఖంగా జీవించారు.



# వీణకు నెయ్యి

ఒక రాజుగారి ఆస్థానంలో ఒక వైణికుడు ఉండేవాడు. రాజుగారికి ఆ విద్వాంసుడంటే ఎంతో అభిమానం. విద్వాంసుడు కొంచెం బిడియస్థుడు. అందుచేత రాజుగారు అతని అవసరాలు కనిపెట్టి, అతని కుటుంబపోషణలో ఏ లోటూ రాకుండా చూస్తూ ఉండేవాడు.

ఒక ఏడు వైణికుడు తన కుమార్తెకు వివాహం తలపెట్టాడు. రాజుగారు పెళ్ళి ఖర్చులకు తగినట్టుగా ధనసహాయం కూడా చేశాడు. అయితే, ఆ ఏడు దేశంలో పాడిపంటలకు కాటకం రావటంవల్ల వైణికుడు పెళ్ళికి అన్ని వస్తువులూ సమకూర్చాడుగాని, నెయ్యి పుట్టించలేకపోయాడు.

రాజుగారు తప్ప గత్యంతరం లేదనుకుని ఆయన రాజుగారి దర్బారుకు వెళ్ళాడు. కాని నెయ్యి కావాలని రాజుగారిని అడగటానికి బిడియం వేసింది.

వైణికుడు రానే వచ్చాడు గదా అని రాజుగారు అతనిచేత కచేరీ ఏర్పాటు చేయించాడు. వైణికుడు వీణవాయిస్తూ మధ్యలో ఆగిపోయాడు.

"ఆగావేం ?" అని రాజు అడిగాడు.

"నెయ్యి కావాలి, మహారాజా !" అని చప్పున అనేసి వైణికుడు భయపడిపోయి, "వేళ్ళకు నెయ్యి రాచుకుంటేగాని వాయింపు సరిగా ఉండదు !" అన్నాడు

రాజు సంగతి గ్రహించి, "వీణకు ఎన్ని డబ్బాల నెయ్యి కావాలి ?" అన్నాడు.

"రెండు డబ్బాలు చాలు, మహారాజా !" అన్నాడు వైణికుడు ప్రాణం లేచివచ్చి.

—మండపాక ఉమాదేవి.





# ఒకరోజు రాజు

## 2

మర్నాడు ఉదయం జఫర్, మస్రూర్‌లు వెళ్ళి ఖలీఫాను నిద్రలేపారు. ఆయన అబూ అల్‌హసన్ నిద్రపోతున్న గదికి వెళ్ళి, తెరల చాటున దాక్కున్నాడు. అక్కడి నుంచి ఆయన ఎవరి కంటా పడకుండా జరిగే దంతా గమనించటానికీ, ఆలకించటానికీ వీలున్నది.

తరవాత జఫర్, మస్రూర్‌లు రాజభవనం లోని ప్రముఖులనూ, స్త్రీలనూ, బానిసలనూ వెంటబెట్టుకుని అదే గదిలోకి ప్రవేశించారు. నిద్రలేవబోతున్నది ఖలీఫాయే అయినట్టు వారంతా ఎవరి స్థలాలలో వారు మౌనంగా నిలబడ్డారు.

ముందుగా తరిఫీదు పొందిన ఒక బానిస హసన్ ముక్కు దగ్గిర ద్రావకంలో ముంచిన గుడ్డ ఉంచాడు. వెంటనే హసన్ మూడు తుమ్ములు తుమ్మాడు. బానిస అతని ముక్కూ, ముఖమూ పన్నీటితో తుడిచాడు. మత్తు వదిలి హసన్ నిదానంగా కళ్ళు తెరిచి చూశాడు.

తాను పడుకుని ఉన్న పక్క అపూర్వంగా ఉన్నది. దానిమీద పరిచిన దుప్పటి ఎర్ర జరీతో నేసి, ముత్యాలు కుట్టి ఉన్నది. తల ఎత్తి చూస్తే చాలా విశాలమైన గది కనిపించింది. దాని గోడలకు విలువైన పట్టు బట్టలు వేలాడుతున్నాయి. గది మూలలలో బంగారు, స్ఫటిక పాత్రలున్నాయి.

హసన్ తన దృష్టిని కిందికి దింపి, తన చుట్టూ ఉన్న అందమైన స్త్రీలనూ, బానిసలనూ చూశాడు. వారంతా తనకు వంగి సలాములు చేస్తున్నారు. వారి వెనకగా అంతులేని మంత్రులూ, అమీర్లూ, ప్రతీహారులూ, నల్లకొజ్జాలూ ఉన్నారు. ఎత్తు గద్దె మీద గాయకులూ, వారి చుట్టూ వాద్య

గాళ్ళూ సంగీతం వినిపించటానికి సిద్ధంగా ఉన్నారు.

అతను పడుకున్న శయ్యకు సమీపం లోనే ఖలీఫా ధరించే దుస్తులు పెట్టి ఉన్నాయి. వాటి రంగు చూడగానే అవి ఖలీపా ధరించేవని హసన్‌కు తెలిసి పోయింది.

హసన్ మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. అప్పుడు జఫర్ అతన్ని సమీపించి మూడు సలాములు చేసి, ఎంతో వినయంగా, "ఏలిన వారిని లేపటానికి అనుమతి ఇవ్వండి. ఉదయ ప్రార్థనకు వేళ అయింది," అన్నాడు.



అబూ అల్‌హసన్ తన రెండు కళ్ళూ ఒక దాని తరవాత ఒకటి నలుచుకున్నాడు. తన చెయ్యి గిల్లుకుని, "అమ్మో!" అని కేకపెట్టి, "నేను కలగనటం లేదు. నేను ఖలీఫానే!....కాని, ఆ మోసల్ వర్తకుడితో నోటికి వచ్చినదెల్లా మాట్లాడుతూ తెగ తాగానే, దాని ఫలితమే అయి ఉండాలి," అని, గోడకేసి తిరిగి, మళ్ళీ నిద్రపోజూశాడు.

జఫర్ మళ్ళీ అతన్ని సమీపించి, "ఏలిన వారు ఉదయ ప్రార్థన పట్ల ఉదాసీనంగా ఉండటం తమ బానిసకు ఆశ్చర్యంగా ఉన్నది, మన్నించండి!" అన్నాడు.

ఆయన సైగ చేయగానే సంగీతం ఆరంభ మయింది. పాటగాళ్ళు వాద్యాల సహకారంతో శ్రావ్యంగా పాడసాగారు. హసన్ వాళ్ళకేసి చూసి, "ఒరే, హసన్, నిద్రలో ఇలాటి పాట ఎన్నడన్నా విన్నావురా?" అనుకుంటూ లేచి కూర్చున్నాడు. అతను తన కళ్ళను నమ్మలేకుండా ఉన్నాడు. అతని బుర్ర పనిచెయ్యడం లేదు.

అతను తన చేతులు చాచి చూసుకున్నాడు. చేతులు ఉన్నాయి. "ఇది ఆశ్చర్యం కాదూ? విడ్డూరం కాదూ? ఒరే హసన్, నువు ఎక్కడ ఉన్నావు? ఎక్కడ ఉన్నావురా, నా తల్లి కొడుకా? నువు నిద్రపోతున్నావా? మేలుకుని ఉన్నావా? ఎంత కాలంగా నువు ఖలీఫావి? ఈ భవనమూ, ఈ పక్కా, ఈ ఘరానా మనుషులూ, ఈ కొజ్జా




వాళ్ళూ, ఈ అందమైన అమ్మాయిలూ, ఈ చక్కని పాటగాళ్ళూ, వాయిద్యగాళ్ళూ, ఇవీ, అవీ, అవీ అన్నీ ఎప్పటి నుంచీ నీ సొత్తు?'' అన్నాడు.

అంతలో సంగీతం నిలిచి పోయింది. మస్రూర్ ముందుకు వచ్చి, హసన్ ముందు మూడు సార్లు సలాం చేసి, ''ఏలిన వారు చిత్తగించాలి. ఉదయ ప్రార్థన వేళ దాటి పోయింది. తమరు దీవాన్‌కు బయలుదేరే వేళ అయింది,'' అన్నాడు.

తాను ఏదో చెయ్యాలనేసరికి హసన్ అనుమానం రెట్టింపు అయింది. అతను మస్రూర్ కేసి తీక్షణంగా చూస్తూ, ''ఏయ్, ఎవరు నువు? నేను ఎవరు?'' అని అడిగాడు.

''తమరు మా ప్రభువు; ముసల్మానుల ఏలిక; ఖలీఫా హారూనల్ రషీద్. అబ్బాస్ సంతతిలో అయిదోవారు. ఈ అధమాధముడు తమ ఖడ్గాన్ని పట్టుకునే గౌరవం పొందిన అనామకుడు మస్రూర్,'' అంటూ మస్రూర్ అత్యంత నమ్రతతో సమాధానమిచ్చాడు.

''అంతా అబద్ధం!'' అని అబూ అల్ హసన్ అరిచాడు.

''ఏలినవారు నన్ను పరీక్షించాలని అలా అంటున్నారు. పరీక్షలు చాలు, మహా ప్రభూ. తమ కేదో పీడకల వచ్చి ఉంటుంది,'' అన్నాడు మస్రూర్.

అబూ అల్ హసన్ నిగ్రహం తప్పి, పక్క మీద విరుచుకు పడి పోయి వెర్రిగా నవ్వుతూ, కాళ్ళు కొట్టుకుంటూ, దుప్పట్లు చుట్టుకోసాగాడు. ఇదంతా తెర వెనక నుంచి చూస్తున్న ఖలీఫా నవ్వు అపుకోవటానికి నానా పాట్లూ పడ్డాడు.

నవ్వు తెర ఆగిపోయాక హసన్ లేచి కూర్చుని ఒక చిన్న నల్ల బానిసను దగ్గిరికి రమ్మని, ''నన్నెరుగుదువా? బాగా నా ముఖంకేసి పరీక్షగా చూసి, నేను ఎవరో చెప్పగలవా?'' అని అడిగాడు.

నల్ల బానిస అణకువగా కళ్ళు దించి, ''తమరు మా ప్రభువు, హారూనల్ రషీద్,'' అన్నాడు.

"నల్ల మొహంవాడా, అంతా అబద్ధం. నువు నిజం చెప్పటం లేదు," అన్నాడు హసన్.

అతను ఒక చిన్న ఆడబానిస కేసి తన వేలు చూపి, "కొరుకు!" అన్నాడు. ఆమె ఆ వేలిని గట్టిగా కొరికింది. హసన్ బాధతో కేక పెట్టి, "నేను నిద్ర పోవటం లేదు, మేలుకునే ఉన్నాను," అని ఆ బానిసను, "నన్ను గురించి వీళ్ళు చెప్పేది నిజమా?" అని అడిగాడు.

ఆ బానిస పిల్ల చెయ్యిచాచి, "అల్లా ఏలిన వారిని కాపాడాలి. తమరు ఖలీఫా హారూనల్ రషీద్‌గారే!" అన్నది.

"నా తల్లి కొడకా, విన్నావురా? నువు ఖలీఫావే!" అని అరిచి ఆ పిల్ల కేసి తిరిగి, "అబద్ధం ఆడుతున్నావే, తప్పుడుముండా! నేనెవరో నా కన్న నీకు బాగా తెలుసా?" అన్నాడు హసన్.

అంతలో కొజ్జాల పెద్ద వచ్చి, "ఏలిన వారు జలకమాడే వేళ అయింది," అంటూ హసన్‌ను పక్క మీది నుంచి కిందికి దింపాడు. అతను పక్క దిగగానే అందరూ ఒక్కసారిగా, "ఖలీఫాకు జై!" అని కేక పెట్టారు.

"ఎంత చిత్రం! నిన్న నేను అబూ అల్ హసన్‌ను. ఇవాళ ఖలీఫా హారూనల్ రషీద్‌ను లాగుంది!" అని హసన్ అనుకుంటుండగా



కొజ్జాల పెద్ద అతని కాళ్ళ దగ్గిర పాదరక్షలుంచాడు. అటువంటి పాదరక్షలను హసన్ ఎన్నడూ చూడలేదు. వాటికి బంగారు నగిషీలూ, ముత్యాలూ ఉన్నాయి. ఎవరో తనకు ఖరీదైన పాదరక్షలు బహూకరించారనుకుంటూ హసన్ వాటిలో పాదాలు దూర్చాడు.

ఇదంతా చూసే వాళ్ళు నవ్వు అతికష్టం మీద దాచుకోగలిగారు. ఖలీఫా తెరల వెనక నవ్వుతో విరుచుకు పడిపోయాడు.

తరవాత హసన్‌కు పన్నీటితో స్నానం చేయించి, రాజోచితమైన దుస్తులు తొడిగి, నెత్తిన కిరీటం పెట్టి, అతని చేతికి బంగారు దండం ఇచ్చారు.

"నేను అబూ అల్ హసన్‌ను అవునా, కానా ?" అని అతను తనలో ఒక క్షణం వితర్కించుకుని, పైకి అందరూ వినేలాగా, "నేను అబూ అల్ హసన్‌ను కాను. అలా అని అన్నవాణ్ణి కొరత వేయించేస్తాను! నేను నేనే! హరూనల్ రషీద్‌ను!" అన్నాడు.

అతను అందరితో కలిసి దర్బారు భవనానికి వెళ్ళాడు. మస్రూర్ అతన్ని సింహాసనం మీదికి ఎక్కించి, రాజ దండాన్ని అతని మోకాళ్ళ మీద అడ్డంగా ఉంచాడు. అందరూ హర్షధ్వనులు చేశారు.

హసన్ సభా భవనాన్ని కలయజూశాడు. దానికి నలభై ద్వారాలున్నాయి. ద్వారాలన్నిటా జనం కిటకిటలాడుతున్నారు. కత్తులు పట్టుకున్న రక్షకభటులూ, వజీర్లూ, అమీర్లూ, కులీనులూ, రాయబారులూ అతనికి కనిపించారు. ఆ జనంలో అతను జఫర్‌నూ, మరికొందరు రాజభవనోద్యోగులనూ గుర్తించాడు.

జఫర్ ముందుకు వచ్చి, ఒక కాగితాల కట్ట తీసి, ఆ రోజు ఖలీఫా పరిశీలించవలసిన విన్నపాలు చదవసాగాడు. అవి ఏమిటో తనకు అర్థం కాకపోయినా హసన్ తొణకకుండా విని, ప్రతి విన్నపం మీదా ఎంతో తెలివిగా తన నిర్ణయం చెప్పాడు. ఇక్కడ కూడా తెర చాటు నుంచి అంతా గమనిస్తున్న ఖలీఫా హసన్ నిర్ణయాలకు అద్భుతం చెందాడు.

జఫర్ విన్నపాలు చదవటం ముగియగానే హసన్, రక్షకభట నాయకుడి కోసం



అడిగాడు. అహ్మద్‌ను అతనికి చూపారు. హసన్ అహ్మద్‌ను దగ్గిరికి పిలిచి, సాష్టాంగ పడిన అహ్మద్‌ను లేవమని, "నువు పది మంది భటులను వెంట బెట్టుకుని ఫలాని వీధిలో, ఫలాని పేటలో ఫలాని ఇంట ఉండే వాణ్ణీ, వాడి ఇద్దరు అనుచరులనూ పట్టుకో. ఆ ఇంటివాడు ఆ పేటకు అధిపతి. వాళ్ళ ముగ్గురికీ ముందుగా నాలుగేసి వందలు దెబ్బలు రుచి చూపించు. తరవాత వాళ్ళకు చింకి పాతలు కట్టి, ఒక ఒంటె మీద వెనక్కు తిప్పి కూర్చోబెట్టి, నాలుగు పేటలూ తిప్పు. తిప్పేటప్పుడు ఇలా చాటింపు వేయించు: 'ఇతరుల పరువు తీసే వారికీ, స్త్రీలను అగౌరవ పరిచే వాళ్ళకూ, సజ్జనుల మీద నిందలు వేసే వాళ్ళకూ ఇదే శిక్ష!' ఈ తతంగం పూర్తి అయాక పేట అధికారిని కొరత వేయించి, వాడి శవాన్ని కందకం లోకి ఈడ్పించు. వాడి అనుచరులను తేలికగా శిక్షించు," అన్నాడు.

కొత్త ఖలీఫా ఆజ్ఞలను అమలు చెయ్యమని అహ్మద్‌కు అదివరకే హెచ్చరిక అంది ఉండటం చేత, అతను సలాం కొట్టి, హసన్ ఆజ్ఞలను అమలు చెయ్యటానికి వెళ్ళిపోయాడు.

తరవాత హసన్ ఖలీఫా హోదాలో అనేక తీర్పులిచ్చాడు, ఉద్యోగాలు ఇచ్చాడు, ఉద్యోగులను తొలగించాడు. రాచకార్యాలన్నీ ఎంతో సమర్థతతో నిర్వర్తించాడు. ఇదంతా చాటునవుండి చూస్తున్న ఖలీఫా చాలా సంతోషించాడు.



అహ్మద్ కొంతసేపటికి తిరిగి వచ్చి, హసన్ చేతికి ఒక కాగితం ఇచ్చాడు. హసన్ ఆజ్ఞలను అహ్మద్ పూర్తిగా పాలించినట్టు ఆ కాగితం మీద సాక్షులు చాలా మంది సంతకాలు చేశారు.

"మంచిది. అపవాదులు ప్రచారం చేసే వాళ్ళకూ, ఆడవాళ్ళ శీలం చెడగొట్టే వాళ్ళకూ, ఇతరుల విషయాలలో జోక్యం కలిగించుకునే వాళ్ళకూ నేను ఇలాటి శిక్ష ఇస్తాను. అందరూ బాగా గుర్తుంచుకోండి," అని హసన్ ప్రకటించాడు.

తరవాత అతను కోశాధికారిని పిలిచి, "నువు సంచీలో వెయ్యి బంగారు దీనా రాలు తీసుకుని ఫలాని పేటలో అబూ అల్ హసన్ అనే వాడి ఇంటికి వెళ్ళి, హసన్ తల్లికి ప్రణామం చేసి, 'ఖలీఫాగారు తమకు ఈ వెయ్యి దీనారాలు బహుమానంగా పంపారు. ఖజానా ఖాళీగా ఉండటం చేత ఇంతకన్న ఎక్కువ పంపలేక పోయారు' అని మనవి చేసి, తిరిగి వచ్చి ఏమి చేసినదీ నాకు చెప్పు," అన్నాడు.

కోశాధికారి అతని ఆజ్ఞ పాలించటానికి వెళ్ళిపోయాడు.

దర్బారు ముగిసిందని హసన్ జఫర్‌కు సంజ్ఞ చేశాడు. జఫర్ సభికులకందరికీ అదే సంజ్ఞ చేశాడు. అందరూ సింహాసనానికి వంగి సలాము చేసి వెళ్ళిపోయారు. చివరకు హసన్ వెంట జఫర్, మస్రూర్‌లు మాత్రమే మిగిలారు. వాళ్ళు అతన్ని సింహాసనం మీది నుంచి దించి జనానాకు చేర్చారు.

అక్కడ భోజనాలకు అంతా సిద్ధంగా ఉన్నది. స్త్రీలు హసన్‌ను చుట్టుముట్టి భోజన శాలలోకి తీసుకుపోయారు. లోపల చక్కని సంగీతం వినిపిస్తున్నది. ఆడపిల్లలు శ్రావ్యంగా పాడుతున్నారు.

"సందేహం ఏమీ లేదు. నేను నిశ్చయంగా హరూనల్ రషీద్‌నే. వింటున్నాను, చూస్తున్నాను. వాసనలు తెలుస్తున్నాయి. నడుస్తున్నాను. అడుగడుగునా నాకు గౌరవ మర్యాదలు జరుగుతున్నాయి. అందుచేత నేను తప్పక ఖలీఫానే!" అనుకున్నాడు హసన్.

—(ఇంకావుంది)






# మునసబు యుక్తి

ఒకసారి రామశాస్త్రి అనే పండితుడు రాజధానికి వెళ్ళి, రాజుగారి వద్ద తన పాండిత్యాన్ని ప్రదర్శించి, బహుమానం కింద రాజుగారి నుంచి కొంత వెండీ, బంగారమూ పుచ్చుకుని తన గ్రామానికి తిరిగి పోతూ, దారిలో తన అన్న ఉండే గ్రామంలో ఆగి, చూసిపోదామని అన్న ఇంటికి వెళ్ళాడు.

రామశాస్త్రి అన్న శివశాస్త్రి గుంభనగా సంసారం గడుపుకుంటూ వస్తున్నప్పటికీ, దినదినగండంగా బ్రతుకు ఈడుస్తూ వస్తున్నాడు. అందుచేత, తమ్ముడు ఇంత బంగారమూ, వెండీ తీసుకు వచ్చేసరికి, అతనికి కన్ను కుట్టింది. ఆ రాత్రి తమ్ముడు పడుకుని నిద్ర పోగానే శివశాస్త్రి అతని ధనపు మూటను తీసి దాచేశాడు.

మర్నాడు ఉదయం రామశాస్త్రి లేచి తన మూట కోసం చూస్తే అది కనిపించ లేదు. ఆ సంగతి అతను అన్నతో చెప్పాడు.

"అరె, ఎంత ప్రమాదం జరిగిందీ! ఎంత దారుణం! దొంగలు ఎవరో కాజేసి ఉంటారు. ఛీ, ఇలా ఎన్నడూ జరగలేదు. ఎంత అప్రతిష్ఠ!" అని కల్లబొల్లి మాటలు మాట్లాడాడు శివశాస్త్రి.

రామశాస్త్రికి ఏం చెయ్యటానికీ పాలుపోలేదు. అతను తన అన్న చెప్పిన మాటలు నమ్మకపోగా, ఈ దొంగతనం ఏదో తన అన్నే చేసి ఉంటాడని కూడా అనుమానించాడు. కాని దొంగగా తన అన్నను రచ్చకెక్కించటం అతనికి ఎంత మాత్రమూ ఇష్టం లేదు. శివశాస్త్రి పరువు పోకుండా తన వెండి బంగారాలు తనకు తిరిగి వచ్చే మార్గం ఏదన్నా చెబుతాడేమోనని రామశాస్త్రి ఆ వూరి మునసబు వద్దకు పోయి సంగతంతా చెప్పాడు.

మునసబు చాలా తెలివిగలవాడు. ఆయన కొంచెం సేపు ఆలోచించి రామశాస్త్రికి ఒక

ఉపాయం చెప్పాడు. రామశాస్త్రి ఆ ఉపాయాన్ని ఆమోదించాడు.

మరి కొంత సేపటికి ఇద్దరు తలారి వాళ్ళు రామశాస్త్రిని పెడరెక్కలు విరిచి కట్టి, మునసబు వెంట శివశాస్త్రి ఇంటికి తెచ్చారు. శివశాస్త్రి ఇదంతా చూసి చాలా కంగారు పడ్డాడు. తన తమ్ముడు ఏమి నేరం చేశాడో అతనికి అర్థం కాలేదు. కాని రామశాస్త్రి ఏదో నేరం చేసిన వాడిలాగే, అన్న ముఖం చూడలేనట్టు తల వంచేసుకుని, విచారంగా నిలబడ్డాడు.

మునసబు శివశాస్త్రితో, "చూడండి, శివశాస్త్రిగారూ! మీ తమ్ముడు ఇంత పని చేశాడంటే నాకే నమ్మశక్యం కాకుండా ఉన్నది. కాని ఇంతకు ముందే రాజధాని నుంచి వార్త వచ్చింది. అక్కడ మీవాడు బంగారం దొంగిలించాడట. అతను ఈ గ్రామం కేసి వచ్చినట్టు రుజువయిందట. అతను కిందటి రాత్రి మీ ఇంట్లో పడుకున్నాడు గనక, దాన్ని ఎక్కడైనా దాచాడేమో సోదా చెయ్యటం నా విధి. మీ ఇల్లు సోదా చెయ్యవలిసి వచ్చినందుకు నేనెంతో బాధ పడుతున్నాను. కాని ఏం చెయ్యను? ఉద్యోగధర్మం, తప్పదు! నాకు మీరు సహాయం చెయ్యాలి," అన్నాడు.

ఆయన రామశాస్త్రిని తన వెంట తీసుకుపోతూ తలారి వాళ్ళను అక్కడే ఉంచి, ఇల్లు సోదా చెయ్యటానికి మనుషులను పంపుతానన్నాడు.

ఆ మనుషులు వచ్చే లోపల శివశాస్త్రి తాను దాచిన వెండి బంగారాల మూటను తెచ్చి, రామశాస్త్రి పడుకున్న చోట పెట్టేశాడు. మునసబు పంపిన మనుషులకు ఆ మూట దొరికింది. వాళ్ళు దాన్ని మునసబు ఇంటికి తీసుకుపోయారు.

తరవాత కొంత సేపటికి రామశాస్త్రి అదే మూటతో సహా అన్న వద్దకు తిరిగి వచ్చి, "మునసబుగారు పొరబడ్డాడు. నేను నిర్దోషినని రుజువయింది. ఇది రాజుగారు నిజంగా నా కిచ్చిన బహుమానమే. నేనిక వెళ్ళి వస్తాను," అంటూ అన్న వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.





# తమ్ముడి అదృష్టం

ఒక గ్రామంలో ఒక రైతుకు మూడు ఎకరాల బీడుభూమి ఉండేది. ఆయనకు రామయ్యా, సోమయ్యా అని ఇద్దరు కుమారులు. పెద్దవాడు రామయ్య వక్రబుద్ధి గలవాడు. చిన్నవాడు సోమయ్య నెమ్మదైన వాడు. పెద్దవాడు బాగుపడలేడనీ, చిన్న వాడికి ఆ శక్తి ఉన్నదనీ అనుకుని, రైతు పెద్దవాడికి రెండు ఎకరాలు ఇచ్చి, చిన్న వాడికి ఒక ఎకరమే ఇచ్చాడు.

తండ్రి చేసిన ఈ ఏర్పాటుకు కొడుకులు అభ్యంతరం చెప్పలేదు. తనకు రావలిసిన దానికన్న ఎక్కువే వచ్చింది గనక రామయ్య మాట్లాడలేదు. తండ్రి తనకు తక్కువ పొలం ఇవ్వటానికి ఏదో కారణం ఉంటుంది లెమ్మని చిన్నవాడు సోమయ్య అనుకుని ఊరుకున్నాడు.

తండ్రి పోయాక అన్నదమ్ములు ఎవరి పొలాలు వారు చేసుకునే తరుణం వచ్చింది. రెండు ఎకరాలూ తానుగా సాగుచేసుకునే శక్తి రామయ్యకు లేదు. తమ్ముణ్ణి సహాయం అడుగుదామంటే, అతని పొలం సాగు చెయ్యటానికి తాను తోడు వెళ్ళవలిసి వస్తుంది. అది రామయ్యకు ఇష్టం లేదు. అందుచేత అతను ఒక ఉపాయం ఆలోచించాడు.

అతను తన తమ్ముడి వద్దకు వెళ్ళి, "తమ్ముడూ, నా రెండెకరాల చెక్కలో ఎక్కడో డబ్బు దాచినట్టు నాన్న నాతో చెప్పాడు. మనిద్దరమూ దాన్ని దున్ని, నిధి చెరిసగమూ పంచుకుందాం," అన్నాడు.

తమ్ముడు అందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి ఆ రెండెకరాలూ సాధ్యమైనంత లోతుగా దున్నారు. కాని నిధి ఎక్కడా తగలలేదు.

నిధి ఉండదని ముందే తెలుసును గనక పెద్దవాడు, తన పొలం దున్నటం పూర్తి

వి. గిరిజ

కాగానే తమ్ముడితో, "పోనీలే, ఏం చేస్తాం? మనకు ప్రాప్తం లేదు," అన్నాడు.

"డబ్బు పెట్టినట్టు నాన్న చెప్పాడన్నావు గదా?" అన్నాడు తమ్ముడు.

"ఏ దొంగలన్నా తవ్వుకు పొయ్యారేమో! పోతే పోయిందిలే," అన్నాడు అన్న.

అన్న అలా మాట్లాడడం చూసి సోమయ్య, "నాన్న చెప్పిన నిధి ఒక వేళ నా ఎకరంలో ఉన్నదేమో? అది కూడా దున్నేద్దాం పట్టు!" అన్నాడు.

వాళ్ళు ఇలా మాట్లాడు కుంటూండగా గ్రామాధికారి వచ్చి, "అన్నదమ్ములు సమిష్టి వ్యవసాయం చేస్తున్నారా ఏమిటి?" అని అడిగాడు.

"అదేమీ లేదండీ. మా అన్న పొలంలో నిధి దాచినట్టు మా నాన్న చెప్పాడట. దాన్ని చెరిసగం పంచుకుందామని మా అన్న పొలం అంతా దున్నాం. నా ఎకరం కూడా ఇద్దరమూ దున్ని చూద్దామంటున్నాను. ఒక వేళ నిధి నా ఎకరంలో ఉందేమో!" అన్నాడు తమ్ముడు సోమయ్య.

"వద్దులేరా! నీ పొలం నువు చేసుకో. నిధి ఉంటే నువే ఉంచుకో. అందులో నాకు భాగం వద్దులే!" అన్నాడు రామయ్య, నిధి అంటూ కల్పించిన వాడు తనే గనక.

ఈ మాటకు గ్రామాధికారి రామయ్య బుద్ధి అర్థం చేసుకుని నవ్వి వెళ్ళిపోయాడు.

సోమయ్య తన ఎకరమూ దున్ను కుంటూండగా నాగలికి ఏదో అడ్డు తగిలింది. సోమయ్య పలుగుతో తవ్వి ఒక కొయ్య పెట్టె పైకి తీశాడు. దాన్ని తెరిచి చూస్తే అందులో బోలెడన్ని బంగారు నగలు ఉన్నాయి.

వాటిని చూసి రామయ్య వెల తెలా పోయాడు. తాను కాస్త తమ్ముడికి సహాయ పడి ఉంటే అందులో సగం తన వంతుకు వచ్చి ఉండేది. నిధి తనకు అక్కర్లేదని గ్రామాధికారి ఎదటే నోరు జారి అనేశాడు.

సోమయ్య దొరికినదంతా తానే ఉంచేసు కోకుండా తన అన్నకు నిధిలో నుంచి నాలుగు నగలు తీసి ఇచ్చాడు. ఈ పని చేసినందుకు ఊరంతా అతన్ని మెచ్చుకున్నది.





# అజ్ఞాత పండితుడు

చీనాలో విద్వాంసులు పరీక్షలకు కూర్చుని, వాటిలో ఉత్తీర్ణులై, ప్రభుత్వోద్యోగాలు సంపాదించుకునేవారు.

పదిహేడు శతాబ్దాల క్రితం ఒక గ్రామంలో పావో స్వాన్ అనే యువకుడైన విద్వాంసుడు పరీక్షకు కూర్చుందామని రాజధానికి బయలు దేరాడు. దారిలో అతనికి మరొక యువక విద్వాంసుడు తటస్థపడ్డాడు.

ఈ కొత్త యువకుడు గుండె నొప్పితో బాధపడుతూ ఉండటం చూసి పావో ఆగి, అతనికి సహాయపడబోయాడు. కాని పావో కృషి వృథా అయింది. గుండె పోటుతో బాధ పడుతున్న విద్వాంసుడు త్వరలోనే మరణించాడు.

చనిపోయిన యువకుడి పేరేమిటో పావోకు తెలియదు. అతని వద్ద పది వెండి కాసులూ, రచనలతో కూడిన కాగితపు చుట్టా ఉన్నాయి.

పావో ఆ కాగితపు చుట్టను శవం మీద కప్పి, ఒక వెండి కాసుతో శవానికి ఉత్తర క్రియలు జరిపి, శవం తల కింద మిగిలిన వెండి కాసులు పెట్టి, శవ పేటికతో సహా శవాన్ని పాతేయించాడు.

అతను చనిపోయిన వాడికి అశ్రుతర్పణం విడిచి, "చనిపోయిన నీకు చాతనైతే, నీ వారికి నువు ఎక్కడ ఉన్నదీ తెలియ బరుచుకో. నేను తొందర పని మీద వెళు తున్నాను. నీ కోసం నేనేమీ చేయలేను," అని చెప్పి ప్రయాణం సాగించాడు.

అతను రాజధాని చేరి పరీక్షలకు కూర్చుని, వాటిలో ఘనంగా ఉత్తీర్ణుడైనాడు. అతని పేరు చాలా దూరం పాకింది.

పావో రాజధానిలో ఉండగా ఒక వింత జరిగింది. ఎవరిదీ కాని గుర్రం ఒకటి పావోను ఆశ్రయించింది. అది పావోను విడిచి పెట్టక పోగా, ఇతరులను ఎంత

మాత్రమూ దగ్గిరికి రానివ్వకపోయింది. గత్యంతరం లేక పావో దాన్ని తన సొంతం చేసుకున్నాడు.

అతను రాజధాని నుంచి స్వగ్రామానికి తిరిగి వస్తూ దారి తప్పాడు. చీకటి పడ బోయే సమయంలో అతనికి ఒక కులీనుల భవంతి కనబడింది. ఆ రాత్రికి ఆ యింట తాను తల దాచుకునేటందుకు అవకాశం దొరుకుతుందేమో తెలుసుకుందామని పావో తన పేరు గల కాగితాన్ని ఇంటి నౌకరు కిచ్చి, "అయ్యగారి దర్శనం కోరా నని చెప్పు," అన్నాడు.

ఆ నౌకరు గుర్రాన్ని పరీక్షగా చూసి, లోపలికి వెళ్ళి, ఇంటి యజమానికి కాగితం ఇస్తూ, "బాబుగారూ, ఈ చీటీ ఇచ్చిన మనిషి మన పోయిన గుర్రాన్ని కాజేసిన వాడే!" అన్నాడు.

ఇంటి యజమాని కాగితం మీద "పావో స్వాన్" అనే పేరు చూసి, "ఈయన పేరు మోసిన పండితుడు. ఆయనను లోపలికి తీసుకురా!" అని నౌకరుతో అన్నాడు.

పావో లోపలికి వచ్చినాక ఆయన, "కింద టేడు నేను పోగొట్టుకున్న గుర్రం మీకు ఎలా దొరికింది?" అని అడిగాడు.

"నేను రాజధానికి వెళ్ళేటప్పుడు దారిలో నా కొక విద్వాంసుడు తటస్థపడ్డాడు. అతను గుండె నొప్పితో మరణించాడు..." అంటూ పావో తన కథ అంతా గృహయజమానికి వివరంగా చెప్పాడు.

గృహయజమాని నిర్ఘాంతపోయి, "వాడు నా కొడుకే అయి వుండాలి!" అన్నాడు.

ఆయన మర్నాడు బయలుదేరి వెళ్ళి, పాతిన చోటు నుంచి శవ పేటికను తవ్వి తీసి చూస్తే, చనిపోయిన ఆయన కొడుకే నని తేలింది. పావో చెప్పినట్టుగానే శవం మీద కాగితం చుట్ట కప్పి ఉన్నది. శవం తల కింద వెండి కాసులు కూడా ఉన్నాయి.

పావో తన కొడుకు పట్ల చూపిన శ్రద్ధకు ఎంతో సంతోషించి ఆ కులీనుడు ఆస్థానానికి వెళ్ళి, పావోను గట్టిగా శిఫార్సు చేశాడు. పావో ఉన్నత న్యాయాధికారిగా పని చేసి గొప్ప కీర్తి తెచ్చుకున్నాడు.





# కలికాలం

ఒకప్పుడు ఉజ్జయినీ నగరంలో ఒక బ్రాహ్మణుడూ, ఒక వైశ్యుడూ మిత్రులుగా ఉండేవారు. బ్రాహ్మణుడు కాశీయాత్ర చేయ నిశ్చయించి, ఒక రత్నాన్ని తన మిత్రుడైన వైశ్యుడికిచ్చి, "దీన్ని నీ వద్ద ఉంచు. కాశీ నుంచి తిరిగి వచ్చినాక దీన్ని అమ్మి సంతర్పణ చేయాలి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

బ్రాహ్మణుడు అతి ప్రయాసతో అనేక కష్టాలు గడిచి, కాశీ చేరి, విశ్వేశ్వరుణ్ణి దర్శించుకుని రెండు సంవత్సరాలకు ఇంటికి చేరుకున్నాడు.

అతను ఇంటికి చేరిన మర్నాడే తన మిత్రుడైన వైశ్యుడి ఇంటికి వెళ్ళి, తన రత్నం తనకు ఇయ్యమని అడిగాడు.

వైశ్యుడు ఏమీ ఎరగనట్టు, "రత్నమేమిటి? నాకు ఎప్పుడు ఇచ్చావు?" అని బ్రాహ్మణ్ణి అడిగాడు.

ఇదిపని కాదని బ్రాహ్మణుడు వైశ్యుణ్ణి వెంటబెట్టుకుని రాజుగారి వద్దకు వెళ్ళాడు.

"ఈ పేద బ్రాహ్మణుడు నా వద్ద రత్నం దాచినట్టు అబద్ధం చెబుతున్నాడు," అన్నాడు వైశ్యుడు రాజుతో.

రాజు బ్రాహ్మణుడితో, "నువు ఈ వైశ్యుడి వద్ద రత్నం దాచినట్టు ప్రమాణం చెయ్యి," అన్నాడు. వెంటనే బ్రాహ్మణుడు తన వెంట ఉన్న తన కొడుకు నెత్తిన చెయ్యి పెట్టి, "నిజంగానే నేను ఈ వైశ్యుడి వద్ద ఒక రత్నం దాచపెట్టాను," అన్నాడు.

బ్రాహ్మణుడు అలా అన్న వెంటనే బ్రాహ్మణుడి కుమారుడు మరణించాడు.

ఇది చూసి రాజు బ్రాహ్మణుడితో, "దుర్మార్గుడా, అసత్య ప్రమాణాలతో ఈ వైశ్యుడి వద్ద రత్నం కాజెయ్యాలనుకున్నావా? అందుకే నీ కొడుకు మరణించాడు. నీకు అదే శిక్ష! వెళ్ళు," అన్నాడు.

డి. వి. యస్. శ్రీరామచంద్రమూర్తి

బ్రాహ్మణుడికి భరించరాని దుఃఖం కలిగింది. తాను నిజమే చెప్పాడు, కాని కుమారుడు పోయాడు. ఆయన విచారిస్తూ కుమారుడి శవాన్ని తీసుకుని శ్మశానానికి వెళ్ళాడు.

ఇదంతా గమనిస్తున్న ధర్మదేవత ఒక వృద్ధుడి రూపంలో బ్రాహ్మణుడికి కనిపించి, "నాయనా, ఈ కుర్రవాడు ఎలా పోయాడు?" అని అడిగాడు. బ్రాహ్మణుడు ఆ వృద్ధుడికి జరిగినదంతా చెప్పాడు.

"వెర్రివాడా, నువు కాశీయాత్ర ముగించే సమయంలో కలికాలం ప్రవేశించింది. ఇప్పుడు ధర్మం ఒంటి కాలి మీద కుంటు తున్నది. అందుచేత నువు నిజం చెప్పి మోసపోయావు. రాజుగారి వద్దకు వెళ్ళి అబద్ధం చెప్పి, ఈ నీ కొడుకు మీదనే ప్రమాణం చెయ్యి. అప్పుడు నీకు న్యాయం జరుగుతుంది," అన్నాడు వృద్ధుడు.

అసత్య ప్రమాణం ఎలా చెయ్యాలో వృద్ధుడి నుంచి తెలుసుకుని, బ్రాహ్మణుడు తన కొడుకు శవంతో బాటు రాజుగారి వద్దకు తిరిగి వెళ్ళి, "మహారాజా, నేను మొదట అబద్ధం చెప్పి నా కొడుకును పోగొట్టు కున్నాను. నేను ఈ వైశ్యుడి వద్ద దాచినది ఒక రత్నం కాదు, రెండు రత్నాలు. ఆ మాట నా కొడుకు శవం మీద చెయ్యి పెట్టి ప్రమాణం చేస్తాను." అన్నాడు.

బ్రాహ్మణుడు అలా ప్రమాణం చెయ్యగానే చచ్చిపోయిన కుర్రవాడు బతికాడు.

రాజుగారికి బ్రాహ్మణుడి ప్రమాణంలో నమ్మకం కుదిరింది. ఆయన వైశ్యుణ్ణి పిలిపించి, "దుర్మార్గుడా, ఈ బ్రాహ్మణుడు నీ వద్ద దాచిన రెండు రత్నాలూ ఆయనకు ఇచ్చెయ్యి!" అన్నాడు.

వైశ్యుడు లబోదిబోమంటూ, బ్రాహ్మణుడు తన వద్ద ఒక రత్నమే దాచాడని మొత్తుకున్నాడు.

బ్రాహ్మణుడు రాజుకు జరిగినదంతా చెప్పి, వైశ్యుడి నుంచి తన రత్నం పుచ్చుకుని, రాజుగారి నుంచి కొంత బహుమతి కూడా పొంది ఇంటికి వెళ్ళిపోయాడు. రాజు వైశ్యుణ్ణి కారాగృహంలో పెట్టించాడు.



# కాంతాదాసులు

ఒక రాజుగారు ఏదో సందర్భంలో, స్త్రీ జన్మ చాలా చెడ్డదనీ, స్త్రీలు ఎప్పుడూ భర్తల మాటకు తల ఒగ్గి పడిఉండటమే జరుగుతున్నదనీ అన్నాడు.

మంత్రి అందుకు ఒప్పుకోక, "మహారాజా, కాంతకు దాసులు కాని పురుషులు ప్రపంచంలో లేరు," అన్నాడు.

ఈ విషయం నిజం తెలుసుకోవాలని రాజు మర్నాటి సభకు సభికులనందరినీ భార్యలతో సహా రావలసిందని హెచ్చరించాడు. మర్నాడు అదే ప్రకారం సభకు అందరూ తమ భార్యలను వెంటపెట్టుకుని వచ్చారు.

"మీలో భార్యలకు విధేయులు కానివారు చేతులెత్తండి," అన్నాడు రాజు.

ఎవరూ చేతులెత్తలేదు. మంత్రి ముఖం వికసించింది.

అంతలో ఒక సభికుడు చెయ్యి ఎత్తాడు.

రాజు సంతోషించి, "నీవు నీ భార్య చెప్పినట్టు వినవు కాదూ ?" అన్నాడు.

"చెయ్యి ఎత్తమని నా భార్యే చెప్పింది, మహారాజా!" అన్నాడు ఆ సభికుడు.

—విల్లూరి రామప్రసాదరావు





# అమృతం

ద్వాపరయుగంలో ఉత్తరకురుభూములలో భృంగిరసుడు అనే సామాన్య గృహస్థు ఒకడు ఉండేవాడు. ఆయనకు అమృతాన్ని సాధించి చావు లేకుండా చేసుకోవాలన్న కోరిక కలిగింది.

అందుచేత భృంగిరసుడు గంధమాదన పర్వతానికి వెళ్ళాడు. అది అనేకరకాల దేవ గణాలు తిరిగే ప్రాంతం. అక్కడ భృంగి రసుడికి సిద్ధులతోనూ, చారణులతోనూ పరి చయం కలిగింది.

"అమృతం సాధించటానికి మార్గం ఏమైనా ఉన్నదా?" అని భృంగిరసుడు తన మిత్రులను అడిగాడు.

"అందుకు తపస్సు చెయ్యటం తప్ప మరొక మార్గం లేదు. తపస్సు ద్వారా కూడా అమృతం లభించకపోవచ్చు. కావలిస్తే మాకు తెలిసిన సిద్ధవిద్యలు నేర్పుతాం," అన్నారు సిద్ధ చారణులు.

భృంగిరసుడు వారి వద్ద సిద్ధవిద్యలు పూర్తిగా నేర్చుకుని, దేవతలు సంచరించే ప్రాంతం వదిలి పెట్టి, అరణ్యప్రాంతాలు చేరుకున్నాడు. అక్కడ ఆయన తపస్సు చేద్దామనుకున్నాడు గాని, ఆ తపస్సు సాగలేదు.

అరణ్యంలోని పల్లెలవాళ్ళు, ఆయన వైద్యంలో సిద్ధహస్తుడని తెలుసుకుని ఆయన వద్దకు రాసాగారు. ఆయన ఔషధాలు ఇచ్చే వాడు కాడు. కొన్ని రోగాలకు కారణం చెడుబుద్ధులు. అలాటి రోగాలు కలవారి బుద్ధులు మారితే తప్ప ఆ రోగాలు నయం కావని చెప్పేవాడు. చాలామంది తమ బుద్ధులూ, ఆలోచనలూ మార్చుకుని చికి త్సలు పొందారు. మరి కొన్ని రోగాలను ఆయన ప్రాణాయామంతో నయం చేశాడు. కొన్ని దీర్ఘరోగాలను యోగాసనాల ద్వారా నయం చేశాడు.

ఎల్. శివప్రసాద్

భృంగిరసుడి కీర్తి అరణ్యం దాటి నగరాలకు వ్యాపించింది. లక్షల సంఖ్యలో జనం ఆయన వద్దకు రాసాగారు. ఆయన చుట్టూ ఒక పెద్ద సమాజం ఏర్పడింది.

ప్రజాపాలనా, ప్రజాసౌకర్యాల ఏర్పాట్లూ, శాసనాలూ, ధర్మసూత్రాలూ, న్యాయనిర్ణయాలూ మొదలైనవన్నీ భృంగిరసుడే చూడవలిసి వచ్చింది. ఈ ఊబిలో నుంచి బయటపడకపోతే, తాను అమృతం సాధించే కృషి సాగదని ఆయనకు తెలిసిపోయింది. అందుచేత ఆయన ఈ పనులన్నీ చూడటానికి కొందరు సమర్థులను తయారుచేసి, మరి కొందరు శిష్యులకు సిద్ధవిద్యలు నేర్పి, ఒక నాటి రాత్రి తాను స్థాపించిన భృంగిపురం నుంచి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయేటప్పుడు ఆయన వెంట ముఖ్యులైన శిష్యులు నలుగురు మాత్రమే ఉన్నారు.

భృంగిరసుడు వెళ్ళిపోయాక భృంగిపురవాసులు ఆయనను గురించి రకరకాల కథలు అల్లారు. ఆయన దేవుడనీ, మానవులను ఉద్ధరించటానికి ముని రూపంలో వచ్చి, తన పని పూర్తి కాగానే అంతర్థానమైనాడనీ చెప్పుకున్నారు. వాళ్ళు ఆయనకు ఒక దేవాలయం కట్టి పూజలు చేయసాగారు.

ఈ లోపుగా భృంగిరసుడు తన నలుగురు శిష్యులతోనూ హిమాలయాలకు చేరుకుని అక్కడ తపస్సు ప్రారంభించాడు.



ఆయన శిష్యులు కూడా ఆయన చెప్పిన పద్ధతిలోనే తపస్సు చేసేవారు. అయిదుగురూ పర్వతాల వెంబడీ, లోయలలోనూ తిరిగి, భృంగిరసుడు చూపిన మూలికలను తెచ్చేవారు. తపస్సు ద్వారా సాధించిన శక్తుల వల్ల భృంగిరసుడు తనకు పనికివచ్చే మూలికలను కంటితో చూసీ, వాసన చూసీ, వేళ్ళతో నిమిరీ తెలుసుకునేవాడు.

అనేక సంవత్సరాల పాటు తపస్సూ, సాధనా, పరిశ్రమా చేసిన మీదట భృంగిరసుడు అమృతాన్ని సాధించాడు. ఆ అమృతాన్ని సేవించటానికి తన శిష్యులు నలుగురూ అర్హులు కారేమోనని ఆయనకు అనిపించింది.

అందుచేత ఆయన వారికి ఒక పరీక్ష పెట్ట దలిచాడు. ఆయన తాను తయారు చేసిన అమృతాన్ని మట్టి పాత్రలో తన ముందు పెట్టుకుని, తన శిష్యులను తన ఎదురుగా కూర్చోమని, వారితో, "నా సర్వ శక్తులూ ధారపోసి దీన్ని తయారు చేశాను. ఇది అమృతం అవునో, కాదో తాగితే తప్ప తెలియదు. దైవం అనుకూలించి ఉంటే మన ప్రయత్నం సఫలమై, ఇది అమృతం అవుతుంది. లేని పక్షంలో కాదు," అన్నాడు.

ఇలా అని ఆయన పాత్రలోని ద్రవం కొంత తాగి, విరుచుకు పడిపోయాడు.

అది చూసి శిష్యులు నలుగురూ నిర్ఘాంత పోయారు. "గురువుగారు అమృతం తయారు చెయ్య సంకల్పించి హాలాహలం సాధిం చారు," అన్నారు కొందరు.

శిష్యులలో కృణువు అనేవాడు, "గురువు గారు మహా తపశ్శాలి. ఆయన అనాలో చనగా దీన్ని తాగి ఉండరు," అంటూ తాను కూడా పాత్రలోని ద్రవాన్ని తాగి, అతను కూడా విరుచుకు పడిపోయాడు.

"ఇది తాగి చచ్చేకన్న, మరి నాలుగు కాలాల పాటు బతికి ఉండి, అందరూ చచ్చినట్టే చావటం మేలు," అనుకుని మిగిలిన ముగ్గురు శిష్యులూ శీఘ్రంగా అక్కడి నుంచి బయలుదేరి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే భృంగిరసుడూ, కృణువూ లేచి కూర్చున్నారు. భృంగిరసుడు కృణువుతో, "నాయనా, మనమిద్దరమూ మృత్యువును జయించాం. నేను భూమి మీద చాలా కాలం జీవించాను. బొందితో స్వర్గానికి వెళ్ళే శక్తి వచ్చింది. నేను వెళ్ళి పోతాను. నువు ఇంకా చిన్నవాడివి. అందు చేత నువు మరి కొంత కాలం లోకం పోకడ గమనించి, ఈ జీవితం మీద రోత పుట్టి నప్పుడు నాలాగే బొందితో స్వర్గానికి వచ్చెయ్యి," అని చెప్పి ఆకాశంలోకి తేలి పోయాడు.

కృణువు అనేక వేల సంవత్సరాలు చిరంజీవిగా ఉండి, మనుష్యుల మధ్య తిరిగి, తాను కూడా బొందితో స్వర్గానికి వెళ్ళిపోయాడు.





# కూరల రుచి

ఒక గ్రామంలో ఒక జమీందారు ఉండే వాడు. ఆ గ్రామంలోనే రంగడు అనే అనాథుడుండేవాడు. వాడు సాధువూ, తెలివి తేటలు గల వాడూనూ. అందుచేత జమీందారుకు రంగడిపై అభిమానం కలిగింది. ఆయన వాడికి ఊరికి చాలా దూరాన కొంత పొలం ఇచ్చి, అక్కడ వాడి కొక ఇల్లు కట్టించి పెట్టి, "నువు నాకు ఈ పొలం చేసి పెట్టు. నీకు కావలిసిందంతా నా దివాణం నుంచి తెచ్చుకో," అని చెప్పాడు.

కాని రంగడు దివాణం నుంచి రాగి సంకటికి కావలిసిన సరుకులు మాత్రమే తెప్పించుకుని, ఆ సంకటే తినేవాడు. జమీందారుకు ఈ సంగతి తెలిసింది.

ఒకనాడు జమీందారు వేటకు పోతూ రంగడి పాక వద్ద ఆగి, లోపలికి వెళ్ళాడు. అప్పుడు ఆయనకు రంగడు సంకటి తింటూ కనిపించాడు.

"రంగడూ, నీకు కావలిసినదంతా నే నిస్తానని చెబితిని గదా! కూరానారా లేకుండా ఈ సంకటి తింటున్నావేమిటి?" అని జమీందారు అడిగాడు.

రంగడు నవ్వి, "నాకీ భోజనం చాలు, బాబూ," అన్నాడు.

"ఒక రోజు దివాణానికి రారా. నీకు అన్ని కూరలూ రుచి చూపిస్తానూ," అన్నాడు జమీందారు.

"బాబుగారూ, వీలు చిక్కినప్పుడు వస్తా లెండి," అన్నాడు రంగడు. కాని వాడు దివాణానికి వెళ్ళనే లేదు.

ఇలా ఉండగా జమీందారుగారి గ్రామంలో తిరణాల వచ్చింది. ఆ రోజు జమీందారు అందరికీ సంతర్పణ ఏర్పాటు చేస్తాడు. ఈ తిరణాలకూ రంగడు రాలేదు. తన కోసం ఆగవద్దని సంతర్పణ నిర్వాహకులతో చెప్పి, జమీందారు రంగడి కోసం వెళ్ళాడు.

కుమారి బొమ్మరాజు రుక్మిణి

తన కోసం జమీందారే కదిలి వచ్చేసరికి రంగడు బయలుదేరక తప్పలేదు.

వాళ్ళు సంతర్పణ పందిళ్ళ దగ్గిరికి వచ్చేసరికి భోజనాలు పూర్తి చేసి జనం లేచారు. విస్తళ్ళు తీస్తున్నారు.

"ఇవాళ నువు కూరల రుచి చూద్దువు గాని. నువూ, నేనూ కలిసే భోంచేద్దాం," అన్నాడు జమీందారు.

"తినేదాకా ఎందుకు, బాబుగారూ? చూస్తేనే కూరల రుచి తెలిసిపోతున్నది," అన్నాడు రంగడు.

జమీందారు ఆశ్చర్యపడి, "అలాగా! అయితే ఇవాళ చేసిన కూరలలో ఏది రుచి అయినదో చెప్పు," అన్నాడు.

"దాని పేరు నాకు తెలీదు. నా వెంట వంటశాలకు రండి, అన్నిటికన్న రుచి అయిన కూర చూపిస్తాను," అన్నాడు రంగడు. ఇద్దరూ వంటకాలున్న చోటికి వెళ్ళారు. రంగడు జమీందారుకు బీరకాయ కూర చూపించి, "అన్నిటికన్న రుచి అయిన కూర ఇదే," అన్నాడు.

జమీందారు నవ్వి, "పిచ్చివాడా, అవతల వంకాయకూర ఉండగా ఈ బీరకాయ రుచి అంటావేమిటి? తినందే రుచి తెలియదు," అన్నాడు.

తరవాత వంటవాళ్ళు జమీందారుకూ, రంగడికి వడ్డించారు. జమీందారు వంకాయ కూర నోట పెట్టుకుని ఆశ్చర్యపోయాడు. కూర చాలా కనరుగా ఉంది. రంగడన్న మాటే నిజమయింది. బీరకాయకూర బ్రహ్మాండంగా ఉన్నది.

"రంగడూ, కూర కేసి చూసి రుచి ఎట్లా చెప్పావురా?" అని అడిగాడు, జమీందారు.

రంగడు నవ్వి, "అదేం పెద్ద బ్రహ్మ విద్య, బాబూ? ఎత్తే విస్తళ్ళ నిండా మీరు చెప్పిన వంకాయకూర పారేసి ఉన్నది. బీరకాయకూర ఎవరో తప్ప వదిలెయ్యలేదు," అన్నాడు.

జమీందారు వాడి సూక్ష్మబుద్ధిని మెచ్చుకుని, వాడికి తన దివాణంలోనే నౌకరీ ఇచ్చి, దగ్గిర ఉంచుకున్నాడు.






## 42. కౌరవ పరాజయం

అర్జునుడు కొంతదూరం ముందుకు వెళ్ళి కౌరవసేనల మీద బాణవర్షం కురిపించి, గట్టిగా శంఖం పూరించాడు. ఆ ధ్వని విని గోవులు మోరలెత్తి వెనక్కు తిరిగి పరిగెత్త సాగాయి. అర్జునుడు వచ్చిన పని అప్పుడే తీరినట్టు కనపడింది. కాని అతను దుర్యోధనుడి మీదికి పోతూ ఉండగా, కౌరవ వీరులు అందరూ అతనికి ఎదురు వచ్చారు. అర్జునుడు వారిలో కర్ణుణ్ణి చూసి, ఉత్తరుడితో రథాన్ని కర్ణుడి కేసి నడపమన్నాడు.

కర్ణుణ్ణి అనుసరించి ఉన్న యోధులు కొందరు అర్జునుడిపై యుద్ధం ప్రారంభించారు. అర్జునుడు వారి నందరినీ ఓడించి, కొందరిని చంపాడు. యుద్ధం తీవ్రమయింది. అర్జునుడి చేత చచ్చిన వారిలో కర్ణుడి తమ్ముడు కూడా ఉన్నాడు. అది చూసి కర్ణుడు అమిత పౌరుషంతో అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. అర్జునుడు కోరినదీ అదే. ఇద్దరూ ద్వంద్వయుద్ధం చేస్తూంటే మిగిలిన వాళ్ళు చూస్తూ ఉండిపోయారు. కొంత సేపు యుద్ధం చేసి, తీవ్రంగా గాయపడి కర్ణుడు వెనక్కుపోయాడు.

కౌరవులు అర్జునుడి యుద్ధ నైపుణ్యాన్నే గాక ఉత్తరుడి సారథ్య నైపుణ్యాన్ని కూడా మెచ్చుకున్నారు.

కర్ణుడు వెనక్కు తగ్గగానే మళ్ళీ కౌరవ యోధులందరూ అర్జునుడిపై యుద్ధం సాగించారు. వారిలో కృపాచార్యుణ్ణి ఎంచుకుని అర్జునుడు తన రథాన్ని ఉత్తరుడి చేత అటు నడిపించాడు. అర్జునుడి రథం కృపా



చార్యుడి రథానికి ప్రదక్షిణం చేసి ఎదురుగా నిలబడింది. అర్జునుడు శంఖం ఊదాడు. ఇద్దరికీ ఘోరంగా జరిగిన యుద్ధంలో కృపాచార్యుడు ఓడాడు.

కృపాచార్యుడు వెనక్కు తగ్గగానే ద్రోణుడు అర్జునుడితో యుద్ధం చేయటానికి ముందుకు వచ్చాడు. అప్పుడు అర్జునుడు ద్రోణుడికి నమస్కారం చేసి, "గురూ, వనవాసంలో మేము చాలా కాలం కష్టాలు అనుభవించాం. మా మీద కోపం వద్దు. ముందు మీరు నా మీద బాణం వేస్తేనేగాని నేను మీతో యుద్ధం చెయ్యలేను," అన్నాడు.

ద్రోణుడు ముందుగా తానే అర్జునుడిపై బాణాలు వేశాడు. తరవాత ఇద్దరూ యుద్ధం చేశారు. నిజానికి కౌరవ సేనలో ద్రోణుడికి చాలిన యోధుడు లేడు. అర్జునుడు అయనను బాణ వర్షంలో ముంచి ఎత్తేసరిగి, కౌరవసేనలలో హాహాకారాలు చెలరేగాయి.

అది చూసి ద్రోణుడి కొడుకైన అశ్వత్థామ అర్జునుణ్ణి తన బాణాలతో తాకాడు. అప్పుడు అర్జునుడు ద్రోణుణ్ణి తొలగిపోనిచ్చి, తన రథాన్ని అశ్వత్థామ కేసి నడిపించాడు. అశ్వత్థామ అర్జునుణ్ణి చాలాసేపు చిక్కుపెట్టాడు, కాని చివరకు అర్జునుడిదే పైచెయ్యి అయింది.

ఈ విధంగా అర్జునుడు విజృంభించి మరొకసారి కర్ణుడితోనూ, దుశ్శాసనుడితోనూ, కౌరవ వీరులందరితోనూ యుద్ధం చేశాడు. ఆ యోధులు పారిపోసాగారు. అప్పుడు భీష్ముడు అర్జునుడితో యుద్ధానికి వచ్చాడు.

ఇద్దరూ ఒకరి మీద ఒకరు అస్త్రాలు ప్రయోగించుకున్నారు. తరవాత మామూలు బాణాలతో యుద్ధం చేశారు. చివరకు భీష్ముడు రథంలో తెలివితప్పి పడిపోయాడు. ఆయన సారథి రథాన్ని దూరంగా తోలుకుపోయాడు.

అది చూసి దుర్యోధనుడే అర్జునుడి పైకి వచ్చాడు. ఇద్దరూ తీవ్రంగానే యుద్ధం చేశారు. అర్జునుడు ఒక బాణంతో దుర్యోధనుడి రొమ్ములో కొట్టాడు. ఆ దెబ్బతో దుర్యో

ధనుడు రథంతో సహా పారిపోయాడు. పారి పోతున్న దుర్యోధనుణ్ణి చూసి అర్జునుడు గేలి చేశాడు.

దుర్యోధనుడు రోషం వచ్చి, తిరిగి అర్జునుడి కేసి వచ్చాడు. అతని వెంట మిగిలిన కౌరవ యోధులందరూ వచ్చారు. అర్జునుడు ఆ అందరితోనూ యుద్ధం చేస్తూ సంమోహనాస్త్రం ప్రయోగించాడు. దాని ఫలితంగా యోధులందరూ ఆయుధాలు జారవిడిచి మూర్ఛపోయారు.

అప్పుడు అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, పగ్గాలు పక్కన పెట్టి వెళ్ళి, త్వరగా ఆ యోధుల తలగుడ్డలు తీసుకురా. ఉత్తర రంగురంగుల బొమ్మ పొత్తికలు తెమ్మన్నది. ఆ తలగుడ్డలలో కృపుడిది తెల్లనిది, కర్ణుడిది పసుపు పచ్చది, దుర్యోధనుడిదీ, అశ్వత్థామదీ నీలం రంగువి. నేను వేసిన అస్త్రం భీష్ముణ్ణి బాధించదు. అందుచేత ఆయన జోలికి మాత్రం పోకు," అని చెప్పాడు.

ఉత్తరుడు వెళ్ళి, తలపాగాలు తీసుకుని వెంటనే తిరిగి వచ్చి రథం ఎక్కాడు. అతను రథాన్ని సేనల మధ్యగా నడుపుతుంటే భీష్ముడు అర్జునుణ్ణి తన బాణాలతో అటకాయించాడు. అర్జునుడు భీష్ముడి రథం గుర్రాలను చంపి, భీష్ముడితో యుద్ధానికి దిగకుండా ముందుకు సాగాడు.



అంతలో దుర్యోధనుడికి స్పృహ వచ్చింది. నిశ్చింతగా పోతున్న అర్జునుణ్ణి చూసి అతను, "ఇతన్ని ఎందుకిలా నిశ్చింతగా పోనిస్తున్నారు? ఇతను తప్పించుకు పోకుండా చూడండి," అని కేక పెట్టాడు.

ఆ మాట విని భీష్ముడు, "నీ తెలివి ఏమయింది? అందరూ అస్త్రాలు జారవిడిచి స్పృహ తప్పి ఉంటే ఈ అర్జునుడు అందరినీ చంపగలిగి ఉండి కూడా తలగుడ్డలు మాత్రం తీసుకున్నాడు. అతను గెలిచినట్టు ఒప్పుకో. ఆవుల మందలను తీసుకుపోనీ," అన్నాడు.

భీష్ముడు చెప్పిన ప్రకారం కౌరవులు ఓటమి ఒప్పుకుని తిరిగి వెళ్ళి పోవటానికి



తెలిస్తే మీ తండ్రి భయంతో కంగారు పడి పోతాడు. అందుచేత యుద్ధం చేసి కౌరవులను జయించినది నువేనని ఆయనతో చెప్పు," అని ఉత్తరుడితో అన్నాడు.

"మహానుభావా, నువు చేసిన ఈ యుద్ధం నాబోటి వాడివల్ల ఏమవుతుంది? అయినా నీ అజ్ఞ అయేవరకూ నిజం దాచిపెట్టి, నేనే యుద్ధం చేసి గెలిచినట్టు చెబుతాను," అన్నాడు ఉత్తరుడు.

"మనం కాస్త విశ్రాంతి తీసుకుని, గుర్రాలకు నీరు పెట్టి, మధ్యాన్నం దాటి నాక నగరం చేరుదాం. ఈ లోపుగా మీ గోపాలకులను నగరానికి వెళ్ళి, నువు గెలిచినట్టు మీ తండ్రిగారికి వార్త చెప్పమను," అన్నాడు అర్జునుడు.

ఈ లోపుగా విరాటుడు సుశర్మను ఓడించి నగరానికి తిరిగి వచ్చి, కొలువు తీరి కూర్చున్నాడు. పెద్దలైన పౌరులూ, బ్రాహ్మణులూ ఆయన విజయాన్ని అభినందించారు.

ఆయన, "ఉత్తరుడు ఎక్కడికి వెళ్లాడు?" అని అడిగాడు. కౌరవసేనలు వచ్చి గోవుల మందలను పట్టుకున్నాయనీ, వాటిని విడిపించటానికి ఉత్తరుడు బయలుదేరాడనీ, ఉత్తరుడికి బృహన్నల సహాయం వెళ్ళాడనీ అంతఃపుర స్త్రీలు విరాటుడికి చెప్పారు.

ఈ వార్త విని విరాటుడు కంగారుపడి తన మంత్రులతో, "సుశర్మతో యుద్ధం

నిశ్చయించారు. వాళ్ళు వెళ్ళిపోవటం చూసి అర్జునుడు సంతోషించి భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపుడికీ, అశ్వత్థామకూ మిగిలిన కురువీరులకూ నమస్కార బాణాలు వేసి; ఒక బాణంతో దుర్యోధనుడి కిరీటాన్ని మటుకు పగలగొట్టాడు.

అతను ఉత్తరుడితో, "శత్రువులను ఓడించాం. గోగణాలను కాపాడాం. ఇక ఆనందంగా ఇంటికి పద," అన్నాడు.

రథం శమీవృక్షం దగ్గిర మరొకసారి నిలిచింది. పాండవుల అస్త్రాలన్నీ తిరిగి ఆ చెట్టు మీదికి చేరాయి. అర్జునుడు సారథి స్థానంలో కూర్చుని, "పాండవులందరూ తన కొలువులో ఇంత కాలమూ దాగి ఉన్నట్టు

చేసిన మిగిలిన యోధులనందరినీ ఉత్తరుడికి సాయం పంపండి. నపుంసకుణ్ణి సారథిగా పెట్టుకున్న ఉత్తరుడు ప్రాణాలతో ఉన్నాడో, లేడో ముందు తెలుసుకోండి," అంటూ ఆవేశపడ్డాడు.

విరాటుడి భయం చూసి ధర్మరాజు చిన్నగా నవ్వి, "బృహన్నల సారథిగా ఉండగా నీ కుమారుడు గెలిచి తీరుతాడు. కౌరవసేనలే కాదు, దేవాసుర సేనలు ఎదురైనా అతనికి అపజయం ఉండదు," అన్నాడు.

అంతలోనే, ఉత్తరుడు శత్రువులను జయించి, గోవులను విడిపించి తిరిగి వస్తున్నట్టు విరాటుడికి వార్త తెలిసింది. అది విని ధర్మరాజు, "ఉత్తరుడు విజయుడై తిరిగి రావటం శుభం. అయితే, బృహన్నల సారథిగా ఉండగా ఉత్తరుడు జయించటం నాకేమీ ఆశ్చర్యం కలిగించదు," అన్నాడు.

కొడుకు గెలిచాడని వింటూనే విరాటుడు పరమానందభరితుడై, వార్త తెచ్చిన వారికి బంగారు బట్టలు కప్పి, రాజమార్గాలను అలంకరించమనీ, ఉత్తరుడి విజయం చాటించమనీ, మంగళ వాద్యాలతో ఉత్తరుడికి ఎదురు వెళ్ళమనీ ఆజ్ఞాపించాడు.

తరవాత ఆయన సైరంధ్రితో, "పాచికలు పట్టుకురా. కంకుడితో జూదం ఆడాలి," అన్నాడు.



ఇద్దరూ జూదం ఆడటానికి కూర్చున్నారు. అప్పుడు విరాటుడు ధర్మరాజుతో, "చూశావా, కంకభట్టూ, నా కొడుకు ఎందరో మహావీరులను ఒంటరిగా ఎదిరించి, జయించాడు!" అన్నాడు.

దానికి ధర్మరాజు, "బృహన్నల సారథిగా ఉండగా ఎందుకు జయించడూ?" అన్నాడు.

విరాటుడికి చప్పున కోపం వచ్చింది. ఆయన ధర్మరాజుతో, "బ్రాహ్మణాధమా, నా కొడుకుతో సమంగా ఆ నపుంసకుణ్ణి మెచ్చుకుంటావా? నీకు అనదగినదీ, అనరానిదీ కూడా తెలియదే. ఈసారికి నిన్ను క్షమించాను. మరొకసారి ఇలా మాట్లాడితే



నీ ప్రాణానికే ప్రమాదం. జాగ్రత్త!" అన్నాడు.

దానికి ధర్మరాజు, "భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, కృపుడూ గల కౌరవసేనను ఇంద్రుడు కూడా జయించ లేడు. అలాటి శక్తి బృహన్నలకే ఉన్నది. బృహన్నల సహాయం ఉండగా నీ కొడుకు అంతమంది వీరులను గెలవటంలో వింత ఏమీ లేదు," అన్నాడు.

విరాటుడు మండిపడి, "మళ్ళీ అదే మాట అంటావా?" అంటూ పాచికలను ధర్మరాజు ముఖం మీద విసిరాడు. ధర్మ రాజు ముక్కుకు దెబ్బ తగిలి నెత్తురు కార సాగింది. ఆ రక్తం కింద పడేలోపుగా ద్రౌపది పక్కనే ఉండి తన చేతిలోకి పట్టుకున్నది. తరవాత ఆమె ధర్మరాజు అభిప్రాయం గ్రహించి, ఒక బంగారు పాత్ర తెచ్చి, ధర్మ రాజు ముక్కునుండి కారే రక్తాన్ని అందులో పట్టింది.

ఇంతలో ఉత్తరుడూ బృహన్నలా వచ్చి నట్టు ద్వారపాలకుడు విరాటుడితో చెప్పాడు.

"వారిద్దరినీ చూడాలని నేను తొందర పడుతున్నాను. వెంటనే వారిని లోపలికి ప్రవేశపెట్టు," అని ద్వారపాలకుడితో విరా టుడు అన్నాడు.

ధర్మరాజు ద్వారపాలకుడితో రహ స్యంగా, "బృహన్నలను ప్రవేశపెట్టకు. ఉత్తరుణ్ణి మాత్రమే ప్రవేశపెట్టు. యుద్ధంలో తప్ప, నన్నెవరన్నా గాయపరిస్తే వాళ్ళను చంపుతానని బృహన్నలకు వ్రతం ఉన్నది. నా రక్తం చూస్తే అతను మీ రాజును సకుటుంబంగా నాశనం చేస్తాడు," అని చెప్పాడు.

తరవాత ఉత్తరుడు ఒక్కడే విరాటు డున్న చోటికి వచ్చి, తండ్రి కాళ్ళకు నమ స్కారం చేసి, తరవాత ధర్మరాజు కాళ్ళకు నమస్కారం చేసి లేచి, ధర్మరాజు ముక్కు నుంచి కారుతున్న రక్తం చూసి చాలా ఆవే దన పడుతూ, "ఈ మహానుభావుణ్ణి ఎవరు ఇలా చేశారు? ఈ పాడు పని ఎవరిది?" అని అడిగాడు.

"ఈ మతిమాలినవాడు నిన్ను కాదని ఆ నపుంసకుణ్ణి మెచ్చుకుంటుంటే కోపం వచ్చి నేనే ఒక దెబ్బతీశాను," అన్నాడు విరాటుడు.

"ఎంత పొరపాటు చేశావు! బ్రాహ్మణ కోపం కార్చిచ్చులాగా దహిస్తుంది. అందు చేత ఆయనను మంచి చేసుకో," అని ఉత్తరుడు తండ్రికి హితవు చెప్పాడు.

విరాటుడు క్షమాపణ చెప్పుకోగా ధర్మ రాజు, "రాజా, నా కోపం పోయి చాలా సేపయింది. అంతకన్న నా రక్తం నేల మీద పడటం నీ దేశానికీ, నీకూ ఎక్కువ హాని!" అన్నాడు.

ధర్మరాజు ముక్కు నుంచి కారే రక్తం నిలిచిపోయింది. కొద్ది సేపట్లో ఉత్తరుడు బృహన్నలతో సహా అక్కడికి వచ్చాడు. బృహన్నల విరాటరాజుకూ, కంకుడికీ నమ స్కారాలు పెట్టి నిలబడ్డాడు.

అప్పుడు విరాటుడు ఉత్తరుణ్ణి చూసి, బృహన్నలకు వినిపించేలాగా, "నాయనా, నువు నాకు నిజంగా తగిన కొడుకువు అని పించావు. నీలాటి శూరులు ఎక్కడా ఉండరు. కర్ణుడు అంతటి పరాక్రమశాలి గదా, అతనితో ఎలా యుద్ధం చేశావు? భీష్ముడంతటి మహాయోధుణ్ణి ఎలా జయించ గలిగావు? ద్రోణుడూ, ఆయన కొడుకు అశ్వత్థామా ఎంతటి వీరులు! కృపా చార్యుణ్ణి చూస్తేనే సామాన్య యోధులు వణికిపోతారు గదా! దుర్యోధనుడు ఉండనే ఉన్నాడు. ఇలాంటి మహా వీరులందరినీ జయించి, మన గోవులను విడిపించుకు వచ్చావంటే మలయమారుతం వీచినట్టు అనిపించింది. గొప్ప ప్రశంసనీయమైన పని చేశావు," అన్నాడు.

ఈ ప్రశంసలు విని ఉత్తరుడు, "గోవులను నేను విడిపించలేదు. శత్రువులను జయించినది కూడా నేను కాదు. ఎవరో దేవుడు అదంతా చేశాడు. శత్రువులను చూసి బెదిరి పారిపోతున్న నన్ను ఆపి, అతను రథం మీద కూర్చుని, నన్ను సారథిగా పెట్టుకుని, యుద్ధం చేసి గెలిచాడు," అన్నాడు.





# శివపురాణం

## 19

ఆదికాలంలో దేవతలూ, దానవులూ యుద్ధాలు చేసుకున్నప్పుడు దేవతలు అధికంగా చచ్చిపోతూ వచ్చారు. అప్పుడు దేవతలు మేరుపర్వతం మీదికి వెళ్ళి, విష్ణువు దర్శనం చేసుకుని తమకు చావు లేకుండా చెయ్యమని వేడుకున్నారు.

"మీరు దానవులతో కలిసి, పాలసముద్రంలో ఓషధులనన్నిటినీ వేసి, మందర పర్వతాన్ని కవ్వంగా ఉపయోగించి చిలికినట్టయితే, పాలసముద్రంలో నుంచి అమృతం పుట్టుతుంది. అది మీకు చావు లేకుండా చేస్తుంది," అని విష్ణువు వారితో చెప్పాడు.

దేవతలు వెళ్ళి మందర పర్వతాన్ని పెకలించటానికి ప్రయత్నించారు. కాని అది కదలను కూడా లేదు. అప్పుడు దేవతలు మళ్ళీ మేరుపర్వతానికి వెళ్ళి విష్ణుమూర్తితో, మందరపర్వతాన్ని కదల్చటం తమ వల్ల కాలేదని మొరపెట్టుకున్నారు.

విష్ణుమూర్తి ఆదిశేషుడితో, "ఈ దేవతల కోసం నువు వెళ్ళి, మందర పర్వతాన్ని పెకలించి, దాన్ని తీసుకుపోయి పాలసముద్రంలో వేసిరా!" అన్నాడు. ఆదిశేషుడు అలాగే చేశాడు.

పాలసముద్రాన్ని చిలికితే వచ్చే అమృతంలో కొంత భాగం సముద్రుడికి ఇవ్వటానికి దేవతలు ఒప్పుకున్నారు. కాని అంతటితో సమస్య తీరిపోలేదు. మందర పర్వతం పాలసముద్రంలో మునిగిపోయింది. దాన్ని ఎవరన్నా ఎత్తి పట్టి ఉంచితే తప్ప పాలసముద్రాన్ని చిలకటం దేవదానవులకు సాధ్యం కాదు.

దేవతలు మళ్ళీ విష్ణువును ప్రార్థించారు. విష్ణువు మహా కూర్మరూపం ధరించి తన

అట్ట చివరి బొమ్మ



వీపున మందరపర్వతాన్ని పైకెత్తి ఉంచటానికి ఒప్పుకున్నాడు.

అంతా అమరింది గాని చిలకటానికి కవ్వపుతాడు లేదు. అప్పుడు వాసుకి తాను కవ్వపుతాడుగా ఉండటానికి ఒప్పుకున్నాడు. దేవతలూ, దానవులూ పాలసముద్రాన్ని మథించసాగారు. అయితే దేవతలు వాసుకిని తల వైపు పట్టుకుంటామంటే దానవులు అందుకు ఒప్పుకోక, "మేము వాసుకి తోక పట్టుకుంటామా? అదేమీ కుదరదు," అని వాళ్ళే వాసుకి తలను పట్టుకుని, తోకను దేవతల కిచ్చారు.

సముద్రమథనం జరుగుతూ ఉంటే వాసుకి నోళ్ళ నుంచి వెలుపడే సెగలూ, పొగలూ దానవులను బాధించసాగాయి. ఆ సెగ దేవతలకు కూడా కొద్దిగా సోకింది గాని, వారు అంతగా బాధపడ లేదు.

దేవదానవులు ఈ విధంగా ఎంతో శ్రమ పడి పాలసముద్రాన్ని దీర్ఘకాలం మథించిన మీదట అందులో నుంచి అమృతం పుట్టక పోగా హాలాహలం పుట్టి, అమిత వేగంగా అన్ని దిక్కులకూ, వ్యాపించసాగింది.

ఇది చూసి అందరూ హడలిపోయారు. ఏం చెయ్యటానికీ తోచక, వేగంగా కైలాస పర్వతానికి పరిగెత్తి, అక్కడ పార్వతీ సహితుడై ఉన్న శివుణ్ణి చూసి, "దేవదేవా! హాలాహల విషం మూడు లోకాలనూ దహించుతున్నది. దాని నుంచి మమ్మల్ని రక్షించు. లోకాల కన్నిటికీ నువే ఈశ్వరుడివి. నీ పరమ జ్యోతిస్సు దేవతలకూ, దేవేంద్రుడికీ, బ్రహ్మకూ, విష్ణువుకూ అంతు చిక్కేది కాదు," అని స్తోత్రాలు చేశారు.

వారి దుస్థితి చూసి శివుడు జాలిపడి పార్వతితో, "వీళ్ళు క్షీరసాగరాన్ని మథించటం చేత కాలకూట విషం పుట్టి ప్రజలకు ఎలాటి విపత్తు సంప్రాప్తమయిందో చూశావా? అందుచేత నేను విషాన్ని మింగేస్తాను," అన్నాడు.

అందుకు పార్వతి ఒప్పుకున్నది.

అప్పుడు శివుడు, లోకాలన్నిటికీ వ్యాపించే హాలాహల విషమంతా పోగుచేసి తన

అరచేతిలోకి తీసుకుని, నోట్లో వేసుకుని లోపలకు మింగకుండా కంఠంలో వుంచాడు. మహేశ్వరుడి పైన కూడా ఆ విషం తన ప్రభావాన్ని కొద్దిగా చూపకుండా ఊరుకో లేదు. ఆయన కంఠం కమిరిపోయింది. అది మొదలు శివుడికి నీలకంఠుడు అనే పేరు వచ్చింది.

శివుడు కాలకూటాన్ని తొలగించిన మీదట దేవదానవులు తిరిగి పాలసముద్రాన్ని మధించసాగారు. అప్పుడు అందులో నుంచి కామధేనువు పుట్టింది; దాన్ని యజ్ఞంకోసం ఋషులు తీసుకున్నారు. తరవాత ఉచ్చై శ్రవ మనే తెల్లని, గొప్ప గుర్రం పుట్టింది. బలి దాన్ని కోరాడు; ఇంద్రుడు కోరుకుందా మనుకున్నాడు గాని, విష్ణువు వారించాడు.

తరవాత పాలసముద్రం నుంచి ఐరావతం అనే తెల్లని ఏనుగు, నాలుగు దంతాలు కలది పుట్టింది. తరవాత పారిజాతం పుట్టింది. ఆ తరవాత అప్సరసలు పుట్టారు. తరవాత దేదీప్యమానంగా వెలిగిపోతూ లక్ష్మీదేవి పుట్టింది. ఆమె స్వయంగా విష్ణువు వక్షస్థలాన్ని వరించింది. లక్ష్మీదేవితోబాటు పాలసముద్రం నుంచి చంద్రుడు పుట్టాడు.

అన్నీ పుట్టిన అనంతరం పాలసముద్రం నుంచి ధన్వంతరి, అమృతకలశం చేత పట్టుకుని బయటికి వచ్చాడు. వెంటనే దైత్యులు ఆ అమృత కలశాన్ని చప్పున లాగేసుకుని దూరంగా పారిపోయి, అక్కడ తమలో తాము కీచులాడుకో సాగారు. అప్పుడు దేవతలు విష్ణువుతో మొరపెట్టు



కోగా, "విచారించకండి. నేను మాయచేసి, అమృతం మీకే దక్కేటట్టు చేస్తాను," అని విష్ణువు అన్నాడు.

వెంటనే ఆయన అమిత ఆకర్షణీయమైన మోహినీరూపం ధరించి దైత్యులను సమీపించాడు. వాళ్ళు ఆ మోహినిని చూసి మతులు పోయినట్టుగా అయిపోయారు. వాళ్ళు మోహినితో, "ఈ అమృతం కోసం మాలోమేము తగువులాడుకుంటున్నాం. నువు న్యాయంగా మాకు దీన్ని పంచిపెట్టు," అన్నారు.

"నేను చేసే దానికి ఆక్షేపణ చెప్పకుండా ఉంటే అలాగే పంచుతాను," అన్నది మోహిని. దైత్యులు అందుకు ఒప్పుకున్నారు.

మోహిని దేవతలనూ, దానవులనూ వేరు వేరు పంక్తులలో కూర్చోబెట్టి, దేవతల పంక్తికి అమృతం పంచసాగింది. అన్న మాటకు కట్టుబడి దైత్యులు అభ్యంతరం చెప్పలేదు. దేవతలందరూ అమృతం తాగగానే విష్ణువు మోహినీరూపం ఉపసంహరించుకున్నాడు.

విష్ణువు మోహినీ రూపంతో దైత్యులను మభ్యపెట్టి, అమృతాన్ని దేవతల కిచ్చిన మాట విని శివుడు, పార్వతీదేవితో సహా వృషభవాహనం మీద విష్ణువును చూడ వచ్చి, "నీ అవతారాలన్నీ చూశాను గాని, మోహినీరూపం ధరించావట, ఆ రూపాన్ని చూద్దామని వచ్చాం," అన్నాడు.

"దైత్యులను సమ్మోహించటానికి ధరించిన ఆ రూపాన్ని మీకు కూడా చూపిస్తాను," అంటూ విష్ణువు అదృశ్యుడై, మోహినీ రూపంలో బంతితో ఆడుతూ కనిపించాడు.

ఆ మోహినిని చూడగానే శివుడు తన వెంట ఉన్న పార్వతినీ, ప్రమథగణాలనూ పూర్తిగా మరచిపోయాడు. అందరూ చూస్తూ ఉండగానే శివుడు ఆ మోహిని వెంట పోసాగాడు. అంతలోనే ఆయనకు ఇదంతా విష్ణుమాయ అన్నది స్ఫురణకు వచ్చింది. విష్ణువు శివుడి ఆత్మనిష్ఠను మెచ్చుకున్నాడు.

తరవాత శివుడు విష్ణువు వద్ద సెలవు పుచ్చుకుని పార్వతితో సహా కైలాసానికి తిరిగి వచ్చాడు.



ప్రపంచపు వింతలు :

# 129. అపూర్వ జలపాతం "ఏంజెల్"

తూర్పు వెనిజ్యూలా (దక్షిణ అమెరికా) లోని ఈ జలపాతం ప్రపంచంలోని జలపాతాలన్నిటిలోకీ ఎత్తయినది. దీని ఎత్తు 3,212 అడుగులు—అంటే అరమైలుపై చిల్లర. నయాగరా జలపాతం ఇందులో 15 వ వంతు మాత్రమే! ఈ జలపాతంలోని మరొక విశేషమేమిటంటే, ఇది కొండల మీది నుంచి నది పొర్లి కింద పడటం చేత ఏర్పడినది కాదు. కొండలలో నుంచి అంతర్వాహినులు ప్రవహించి రాళ్ళ పొరల నుంచి వెలువడగా ఏర్పడినది. ఈ జలపాతాన్ని నిలువునా చూడటం విమానం మీది నుంచి మాత్రమే సాధ్యమవుతుంది.



Photo by Malati B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

దిగిన కొలది లోతు

పంపినవారు :
పి. తాతారావు

Photo by Madan Gopal



తిరిగిన కొలది మేత

బహుమతి పొందిన వ్యాఖ్య

మంజేరు.
(తూ. గోదావరి జిల్లా)

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
హళెబీడు దేవాలయం (మైసూరు)

మూడవ అట్ట:
బృందావన గార్డెన్స్ (మైసూరు)


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్
దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్ట్

49F-203R-TEL

పుల్లని, తియ్యని
నారింజపళ్లు బోలెడు తెచ్చి,
రసాలు పిండి చేశా చూడు

# న్యూట్రిన్ ఆరెంజ్ క్యాండీ





NCM-278/72 TEL

నిజానికి పిల్లలూ! ఈ న్యూట్రిన్
ఆరెంజి క్యాండీలు అసలు నారింజ
తొనలను మించి రుచించు,
నువ్వు తిని నీ వాళ్లను తినిపించు!




**ఒక్కొక్క మిఠాయియందు ఫలరస పూరిత విందు!** న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం. ప్ర.)

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

---

ఒళ్లనొప్పి, జలుబులు, తలనొప్పి, బెణుకులు — వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్నచోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాల పైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం అదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూ కూడా దొరుకుతోంది.
అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది. నొప్పులను, జలుబులను చప్పున చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజనం లిమిటెడ్




# అమృతాంజనం
## చప్పున పోగొడుతుంది!




AM. 5982


"టీచర్స్ ఆర్ ది పిల్లర్స్ ఆఫ్ ది నేషన్"
—రాధాకృష్ణ పండితుడు.
క్రమశిక్షణ గలిగిన విద్యార్థుల చేతుల్లోనే నవసమాజ నిర్మాణం ఆధారపడి ఉంది। విద్యార్థుల్ని సమర్థవంతంగా మలిచే గురుతర బాధ్యత ఉపాధ్యాయుల చేతుల్లో ఉంది।
త్రివేణి ప్రొడక్షన్స్
బడి పంతులు
నిర్మాత: పి. పేర్రాజు _ దర్శకత్వం: పి. చంద్రశేఖరరెడ్డి బి.ఎ.

ప్రియమైన బాబ్జీకు,

నా కిడ్డీ బ్యాంకు బొమ్మ నిండి పోతున్నది. రేపు నేను దాన్ని ఆంధ్ర బ్యాంకుకు ఖాతా చేయడానికి తీసుకెళ్తున్నాను. నా అక్కౌంటులో ఇప్పటికే 16 రూపాయలు 30 పైసలు ఉన్నాయి. మరి ఈ సంగతి విను. నా బొమ్మకు ఆకలేసినట్టుంటేల్లా డబ్బులు వేస్తాను. అది ఎంతో సరదాగా ఉంటున్నది. డబ్బు కూడబెట్టడం మంచిదని అమ్మ అంటుంది. నీ బొమ్మకు నా ముద్దులు.

నీ నేస్తం

గీత




## ది ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్






FDS AB 1748 TEA

